**ASTAVIDHA NAYIKALU**

by
**62 Poets**

First Edition: May, 2020



Copies: 500

Book Price : Rs. 100/-

*Book Designing & Production:*
**JV Publishers: Jyothi Valaboju**
jyothivalaboju@gmail.com

**Jyothivalaboju**
Phone: 80963 10140

DTP & Type Setting:
**K. Ravi Prabha**,
Cell: 96666 08835, 93999 32729

*Printed at:*
**Karshak Art Printers,**
Vidyanagar, Hyd.44

*for Copies:*
All Major Book Shops

## అష్టవిధనాయికలను తీర్చిదిద్దిన కవులు

1. ఆదూరి ఫణీంద్రరావు
2. ఐతగోని వెంకటేశ్వర్లు
3. ఆకుల శాంతి భూషణ్
4. ఆకుండి శైలజ
5. అల్వాల లక్ష్మణమూర్తి
6. ఎన్.వి. అనంతకృష్ణ
7. చిల్లప్పగారి అనిల జయదీప్
8. అన్నపరెడ్డి సత్యనారాయణ రెడ్డి
9. పేరి వేంకటసూర్యనారాయణమూర్తి (అప్పాజీ)
10. ఆరవల్లి శ్రీదేవి
11. అర్క సోమయాజి ధూళిపాళ
12. డా. బల్లూరి ఉమదేవి
13. భారతి రామచంద్రుని
14. బ్నిం
15. చావలి బాలకృష్ణవేణి
16. చింతా రామకృష్ణారావు
17. ధనికొండ రవిప్రసాద్
18. డా. జంధ్యాల జయకృష్ణ బాపూజీ
19. డా. వజ్జల రంగాచార్యులు
20. డా. వరలక్ష్మి హరవే
21. డా. మహ్మద్ షరీఫ్
22. డా. పాండాల మహేశ్వర్
23. డా. జి. సీతాదేవి
24. గాదిరాజు మధుసూదన రాజు
25. గంగాభవాని శాంకరీదేవి మాతా
26. గొల్లమూడి సంధ్య
27. గుగ్గిళ్ళ జనార్దనాచారి

28. గుండా వేంకట సుబ్బ సహదేవుడు
29. హంసగీతి
30. హరి వేంకట సత్యనారాయణమూర్తి
31. హట్టి భానుమతి
32. డా. జంధ్యాల సుబ్బలక్ష్మి
33. జ్యోతి వలబోజు
34. కడయింటి కృష్ణమూర్తి
35. కందుల నాగేంద్ర వరప్రసాద్
36. కాటేపల్లి లక్ష్మీనరసింహమూర్తి
37. కొనకళ్ళ ఫణీంద్రరావు
38. క్రొవ్విడి వెంకట రాజారావు
39. కుసుమ ఉప్పలపాటి
40. మాచవోలు శ్రీధరరావు
41. మల్కూచి రాజేశ్వర శర్మ
42. సిరిపురపు నాగమల్లికార్జునశర్మ
43. మంథా భానుమతి
44. ముద్దు రాజయ్య అవధాని
45. నాగజ్యోతి రమణ సుసర్ల
46. నేదునూరి రాజేశ్వరి
47. పంతుల వెంకటేశ్వరరావు (తపస్వీ)
48. పి.వి.ఆర్. గోపీనాథ్
49. పోచిరాజు కామేశ్వరరావు
50. రాధాకృష్ణ రేగళ్ళ
51. రాధా వాడపల్లి
52. శ్రీసత్య పర్వతనేని
53. సూర్య కటకం
54. సువర్ణ విజయ
55. టి.టి.శర్మ
56. టేకుమళ్ళ వెంకటప్పయ్య





57. తిరుక్కోవళ్ళూరు శ్రీహర్ష
58. తురిమెళ్ళ రాధాకృష్ణమూర్తి
59. తుమ్మలపల్లి విజయలక్ష్మి
60. వెంకటేశ్వర ప్రసాద్
61. విరించి
62. ఓలేటి స్వరాజ్యలక్ష్మి
63. ఊర ఈశ్వర్ రెడ్డి
64. వి.వి.ఎన్.వరలక్ష్మి
65. యెలిశెట్టి చంద్రశేఖర్

అన్నమయ్య అష్టవిధనాయికా శృంగార నీరాజనం
కావ్యాలంకార సంగ్రహము
మహా వాగ్గేయకారుడు క్షేత్రయ్య
కందుకూరి రుద్రకవి జనార్దనాష్టకము



వరుడు కైవసమైనట్టి వనిత. పరస్త్రీలను గాంక్షింపక తనయందరనుక్తుడైన భర్తను పొందిన సారసాక్షి - స్వాధీనపతిక.

## ఆదూరి ఫణీంద్రరావు

**1.** **స్వాధీనపతిక/భర్తృక**

**శా.** నిన్నే కోరితి నిన్ను మెచ్చితిని నే నీ తోడునీడౌదు ని
న్నెన్నండు న్విడియుండలేననుచు తానెన్నెన్నియో రీతులన్
నన్నే నమ్మిన నాథుడుండ భువిలో నా సాటిలేరందు నీ
వెన్నంగా భువనైకమోహనమెగా యీ రూపలావణ్యముల్.

**2.** **వాసకసజ్జిక**

**ఉ.** ఏగెను దూరదేశమున కేగిన నా సఖుఁడేగుదెంచు, నే
వేగితి నిన్నినాళ్ళుగను వేచితి వేసటఁ వేయికళ్ళతో
వేగమె మల్లెజాజులను వేడుక కొప్పున దాల్చి వెన్నెలన్
జాగరణంబు జేసెదను చంద్రునితోడుగ వాని రాకకై.

**3.** **విరహోత్కంఠిత**

**ఉ.** ఎన్ని దినంబులో గడిచె నెన్నియొ రాత్రములంతరించె నీ
సన్నిధి చేరనైతి సఖ! చాలును జాగును చేయబోకుమా
వెన్నెలవేళ నీ విరహవేదన సైపగజాలనింక, నే
కన్నెను జాలిచూపుమిక కాముని తూపులు తాళనోపరా.

**4.** **విప్రలబ్ధ**

**మత్తే.** తగునా నీకిది న్యాయమా యిటుల సత్యంబైన వాగ్దానముల్
తగచేయన్, మది తల్లడిల్లగను తాత్సారంబు సేయంగ! నీ
వగతో సొక్కిన బేలనైతి దయ యావంతేనియు న్జూపవే
నగలేలా నయగారమేల మనసానందంబు లేకున్నచో?

**5. ఖండిత**

శా. చాలుం జాలును నీదు జాణతనమో చాంచల్యచిత్తాగ్రణీ!
బాలన్మోసము జేతువే యిటుల నన్బాధింప న్యాయంబె నీ
వేలా రాతిరి రాకపోయితివి? నీవేభామతో గూడితో?
చాలున్మోసము నేనెరింగితిని వేషాలింక చాలింపుమా.

**6. కలహాంతరిత**

శా. ఏదో కోపము ప్రజ్వరిల్లగను నేనేమేమియో పల్కితిన్
వాదంబు ల్ప్రతివాదము ల్సహజమే వాగ్యుద్ధమందు న్సఖా
లేదా నీ దయ యొంటినైతి మనగాలేనోయి నిన్వీడియే
భేదంబెంచకు నిన్ను నేను విడువ న్బేలన్కటాక్షించుమా!

**7. ప్రోషితభర్తృక లేదా ప్రోషిత పతిక**

శా. ఏయే దేశము లేగితో ప్రియతమా యెందుంటివో చెప్పుమా!
న్యాయంబా యిటు జాగుచేయ తగునా నన్నొంటరిం జేతువా
నీయందే మది లగ్నమాయెను సఖా నీవెప్పుడేతెంతువో
కాయంబంతయు కళ్ళు చేసుకొని నిన్గాంచంగ నే వేచితిన్.

**8. అభిసారిక**

ఉ. పున్నమి పండువెన్నెలలు పూచిన మల్లెల పోహళింపులున్
సన్నని పిల్లతెమ్మెరల చక్కిలిగింతల సందడింపులో
నన్నిటు లొంటిజేయ తగునా విరహాగ్నికి తాళలేను నే
కన్నెను, నిన్ను వీడి క్షణకాలము నేబ్రతుకంగజాలరా!

**(మొబైల్: 9440496895)**





# ఐతగోని వేంకటేశ్వర్లు

**1. స్వాధీనపతిక**

తన యందంబొకవైపు భర్త కొరకై త్యాగంబు నింకొక్కవై
పున శృంగారపు శయ్యపైన రతియై మోదించి ప్రేమించి దే
వునిగా భర్తఁ దలంచి దేవతగ సంఫుల్లాబ్జమౌ మానసం
బున స్వాధీనపతీశయై ఘనతతో పూజ్యాత్మ తత్సాధ్వియౌ.

**2. వాసకసజ్జిక**

వెడలెన్ బ్రొద్దున ప్లాటు నమ్ముటకుఁ జెప్పెన్ గొప్పునందొప్పుగా
వడిఁదా మల్లెలదండ దెత్తునని రావన్ జాగు రావందగన్
జడచేఁ ద్రిప్పెద శయ్యపై గొనెద నా చందంబు దేహంబుతోఁ
దడయన్ వాసకసజ్జికే విడుచుచున్దా భర్తకై వేచెదున్.

**3. విరహోత్కంఠిత**

మరచెన్ మారసమానకేళి రతిగా మన్నించి నా వన్నెలం
దరుదౌ భంగిమలెన్నొకొన్న పతి తానౌ రాడు వ్యాపార మౌ
నుర ముఖ్యంబ యటంచు సెల్లుగొని తానున్ ప్రేమ సందేశముల్
విరహోత్కంఠిత కుంఠితంబు విడి తాఁబెట్టున్ గదా బెట్టుగాన్.

**4. విప్రలబ్ధ**

వినుమా లుంబిని పార్కు వచ్చెదను నావిం దీర భోగించి మీ
దను బిర్యానిని నారగించెదమనన్ దావచ్చి వాట్సాపు నం
దున సందేశములీయనద్ది పలుకన్ బోలేదు నీవేళ పో
వును మోసంబును విప్రలబ్ధ ప్రియుడే మోసంబుఁ దాఁ జేయగన్.

**5. ఖండిత**

జనితోత్సాహము పుట్టఁ దాఁ బతియె పంచప్రాణముల్ నీవు నా
కని మోసంబును పుచ్చి రాత్రి ప్రియతోఁ గామించి భోగించి వ
చ్చెను నాన్నాయని ఫోనుఁ జేసి పిలుచున్ జిన్నంబునౌ మానసం
బునఁ గోపించుచు తాను ఖండిత ముదంబుం గోలుపోనిట్టులన్.

**6. కలహాంతరిత**

ఒకటే పట్టినదట్టిదౌ శశకు మూడుండయ్య కాళ్లంచు మొం
డికి వేయున్ పరనారి గూడఁ బతి తానే చూడు నంచాడి రో
జిక వేధించగ భర్త యిల్లు విడగా చింతాచితిన్ గూడు తా
నిక యోరా కలహంబు దుష్ఫలముగానీనాడు తద్భామినుల్.

**7. ప్రోషితభర్త**

అరయన్ దేశ విదేశముల్ సను గదా వ్యాపార వాణిజ్యమం
చిరవైరోజులు దాటిపోయినవి రానేరాడు వాట్సాపు రో
జిరవందంగనుఁ జూడడే యనుచు దాఁ జింతించగా నెచ్చెలుల్
మరపుల్ ప్రోషితభర్తృ కైయిడ పరామర్శింతు రింపారగా.

**8. అభిసారిక**

ప్రియుడున్ వీడియొ కాలుఁ జేయు నతినిన్ వేగంబు దర్శించగా
భయమున్ వీడియు నర్ధరాత్రమున చెప్పంబెట్టకే చాటుగా
నయమున్ వీడియు వీడి హాస్టలును నానందంబునాఁబోయెడిన్
రయమిట్లీ యభిసారికే గలుగనౌరా గ్రుడ్డిదౌ ప్రేమతోన్.

**(అష్టావధాని**
**మొబైల్: 9912274442)**





# ఆకుల శాంతి భూషణ్

**1 స్వాధీనభర్తృక**

ఉమా. మీనుల కన్నులో మెఱయు మేనియొ మేనక మీఱు వన్నెలో
బాణము వేసి నీ దరికి బ్రాణము లాగెనొయేమొ సుందరీ!
నేనిక నిన్ను వీడి ధరణిన్మనలేను నిమేషమైన నీ
బానిసనౌచు నిత్యము సపర్యలు జేయుచు ధన్యుడయ్యెదన్.

**2. వాసకసజ్జిక**

ఉమా. వన్నెల పుష్పముల్పరిచి పానుపు సిద్ధము జేయుచు న్కడున్
మిన్నగు వస్త్రము ల్మిగుల మేటివి భూషణము ల్ధరించుచున్
నిన్ను దలంచి దైవముగ నిల్పుచు మానసమందిరమ్మునన్
వెన్నెల రాత్రివేళ కనువిందును జేయగ వేచితిన్సఖా!

**3. విరహోత్కంఠిత**

ఉమా. చెంతను వీడి యేగితివి చేయగనెంచుచు గార్యము ల్సఖా!
ఎంత యలంకరించుకొననేమి ఫలంబయరాకయున్న? నే
కాంతము నోర్చు శక్తి కులకాంతకు సుంతయు లేదు కాంతుడా!
చింతిలు కోమలాంగి వగ ఛిద్రము జేయగ జేరు శీఘ్రమే!

**4. విప్రలబ్ధ**

ఉమా. వేడుకతోడ నేగుచును వేచితి నెంతయొ కూడుచోటునన్
జాడయె లేదు నీదిచట సాగుచు గాలము దెల్లవారినన్
మాడెను నాదు వాంఛలు ప్రమాణము జేసియు మోసగించగన్
పాడియు గాదు నీకెపుడు ప్రాణసఖి న్గడు బాధబెట్టగన్.

**5. ఖండిత**

ఉమా. వద్దుర బొంకవద్దు! పరభామిని గూడుట నేనెఱుంగనే?
ముద్దుల ముద్దెరల్, తనువు పొందిన వేసట దెల్పు సత్యమున్
నిద్దురమాని వేచు నను నిర్దయ ద్రోయుచు మోసగించుచున్
హద్దులు లేని వ్యాకులత నర్పణజేయుట యుక్తమౌనొకో?

**6. కలహాంతరిత**

ఉమా. దోషము లెత్తిజూపుచును ద్రోహము జేసిన ప్రాణనాథునిన్
రోషము మీఱగ న్మిగుల గ్రోధము జూపి పరాభవించుచున్
దూషణజేయ నత్తఱి సుదూరము నేగె బ్రియుండునయ్యొ! వి
శ్లేషము దాళలేనిపుడు స్ఫీతము జింతిల లాభమేమిరా!
( విశ్లేషము = ఎడబాటు... స్ఫీతము = అధికము)

**7. ప్రోషితభర్తృక**

ఉమా. న్యాయమె భామ వీడుచు బ్రయాణము జేసి విదేశమేగుటే?
ప్రాయము బుద్బుదమ్ము సఖ! వ్యర్థము జేయుట భావ్యమేలగున్?
నీ యెడబాటు నోర్చుకొని నే క్షణమైన మనంగలేనయో!
మోయగలేని తాపమిది మోదమిడంగ రయమ్ము రమ్మురా!

**8. అభిసారిక**

ఉమా. ఆ తిమిరారి చాటగుచు నస్తమయమ్మెపుడో! నిశీథమై
శీతకరుండు కోమలిని స్నేహితు సన్నిధి జేర్చుటెప్పుడో!
బ్రాతి యభీష్టమే యెగిసె బ్రాణసముండు వచించినట్టి సం
కేతపు సీమ జేరి రతికేళి యొసంగు ప్రతుష్టి గ్రోలగన్

**(మొబైల్: 94408 37440, 89193 53026)**





## ఆకుండి శైలజ

**1. స్వాధీనపతిక...**

మ.కో.: మేని బంగరు ఛాయ గాంచుచు మెచ్చుచున్ మరి మోహమున్
నేను జూపిన మార్గమందునె నిత్యమున్ పయనించుచున్
మానసమ్మున నన్ను మాత్రమె మానకెప్పుడు దల్చుదా
నాన మీరక వచ్చు నా ప్రియుడాలసించక యో చెలీ!

**2. వాసకసజ్జిక**

మ.కో.: సుందరంబుగ చేలగట్టుకు చుట్టి యుంచెను చిల్కలున్
మందిరమ్మున చందనాదుల మత్తుపైరల నించుచున్
విందు చేయగ నందమంతయు వేడ్కతో మునివాకిటన్
వందనమ్మిడి వేచియుండెను వామ వాసవసజ్జికే!

**3. విప్రలబ్ధ**

మ.కో.: చుక్కలన్నియు వెక్కిరింతగ చూచుచుండ నభమ్ముపై
చక్కగా నను సందెవేళకు సద్దు చేయక రమ్మనెన్
చిక్కనైనను రేయి యింకను చెంత చేరని చెల్వునే
పెక్కుమారులు దల్చుచుండెను విప్రలబ్ధయె యోర్మితో!

**4. అభిసారిక**

మ.కో.: ముద్దులొల్కెడు మోము నందున పూసి గంధపు పూతలే
దిద్దుచున్ తిలకమ్ము శ్రద్ధగ దివ్యతేజము లొల్కగా
వద్ద చేరుమ యిష్టుడాయని వర్తమానము బంపుచున్
ముద్దుగా ముడియందు దాల్చెను పూల నా యభిసారికే!
(అభిసారిక+ఏ అన్నపుడు సంధి లేదు. యడాగమం వస్తుంది)

**5. విరహోత్కంఠిత**

మ.కో.: వాడిపోవుచు నుండె మల్లెలు వాసిగోల్పడె ధూపముల్
పాడుచుక్కలు గేలి చేయగ పంచబాణుడు నవ్వెరా
వేడిగా, మెయి తాకె వెన్నెల, వేళ మించక రమ్మటం
చేడబోయితి వంచు నింతియె యేకధాటిగ నొచ్చెరా!

**6. ఖండిత**

మ.కో.: ఏల నేత్రము లెర్రబారినవేమి కారణమో ప్రియా
పూలరేకులు మేన గంధపు ముద్రలెట్టుల వచ్చెనో
కోలకళ్ళకు నంటె కాటుక గుట్టు విప్పుచు నిప్పుడే
ఆలసించక పొమ్మటంచని యాగ్రహించెను ఖండితే!
(ఖండిత+ఏ.. అన్నపుడు సంధి లేదు)

**7. కలహాంతరిత**

మ.కో.: సారెసారెకు వీధి వెంబడి సంభ్రమమ్ముగ జూచుచున్
భారమయ్యెడు గుండెలో నవభావనల్ చిగురించగా
దూరి, నాథుని పంపినందుకు తూరితూరికి నేడ్చుచున్
ద్వారమందునె వేచియున్నది తన్వి యా కలహాంతరీ!
(కలహాంతరీ అనడం సాధువు కాదు)

**8. ప్రోషితభర్తృక**

మ.కో.: దూరదేశము లేగగా పతి, దొంగచూపులు మాటికిన్
కోరకున్నను, చేరగా నవి, కోతబెట్టగ నెమ్మదిన్
హారమెందుకు, పూవులెందుకు, హంసతూలిక లేలనో?
చేరువన్ ప్రియు రూపు గానక చిక్కె ప్రోషితభర్తృకే!
(భర్తృక + ఏ.. అన్నపుడు సంధి లేదు)

**(మొబైల్: 8341573853)**





# అల్వాల లక్ష్మణమూర్తి

**1. వాసకసజ్జిక**

మెచ్చిన పట్టుచీర గొని మేనున దాల్చితి కంచుకంబుతోన్
కుచ్చులు జార కొంగిడితి కుండలము ల్నగలన్ధరించితిన్
ఇచ్చకమాడు నా పతియె యెచ్చటి కేగెనొ వేచియుంటినే
వచ్చును వెంటనే యనుచు వాసవసజ్జికనైతినే చెలీ!

**2. విరహోత్కంఠిత**

నిద్దురలేదురా ప్రియుడ! నీ విట లేవు నిశీథి యేమగున్
ముద్దులు లేవు నాకిచట ముగ్ధను నొంటిగ వేగిపోతిరా
హద్దులు లేక వృద్ధియయె నామని తోడయె నాగలేను నా
వద్దకురార! యోసఖుడ! వైళమ – దూరమదేమిలెక్కగున్.

**3. ఖండిత**

పరకాంత న్గతగూడి వచ్చెనని నా ప్రాణేశు నిందించితిన్
విరసోక్తు ల్పచరించి గాయముల నావేశమ్ముతో జేసితే
నరిగెన్నా విభు డర్ధరాత్రమున నన్యాయమైపోతినే
పరిహాసంబయె దుఃఖమాగదు గదా – ప్రత్యుక్తి లేకుండగన్.

**4. స్వాధీనపతిక**

కనుసన్న న్మెదరించునెప్పుడును కేకల్వేయు నిందోక్తులన్
మనముస్నోప్యత బూని పేరలుక కామ్యార్థంబు సాధించుగా
తన మాటల్విని వెన్నుడెప్పుడును సత్యాధీనుడై యుండగన్
వినునా? వేరుగ నుండునా? చెలియ! నిర్వేదంబె సాపత్న్యమున్.

**5. విప్రలబ్ధ**

రాసము కోసమై తనను రమ్మన వత్తునటంచు నేగెనే
బాసలు చేసి, వానికయి బంగరు సొమ్ములు దాల్చియుండగన్
మోసము చేసినా దకట మూర్ఖుడె నాకెటులబ్బు సౌఖ్యముల్
వేసితి నేలపై చెదర – వేదన దుస్సహమయ్యెనే చెలీ!

**7. ప్రోషితభర్తృక**

శకుంతల: దూరమాయెను దుఃఖమాగదు తోచకున్నది యిత్తరిన్
అనసూయ: ఊరడిల్లు శకుంతలా! విను మూర్వినాథుడు వచ్చులే
ప్రియంవద: జారనీయకు మశ్రుధారలు జవ్వనీ! దిగులొందకే
శకుంతల: కారుమేఘము గ్రమ్మె నా మది కాంతుగానక చింతలే.

**7. కలహాంతరిత**

మాటకు మాట చెప్పితిని మంకుగ వాదనలెన్నొ జేసితిన్
పోటికి బోయి పంతముగ, పొంతన గూడని నింద సల్పగా
చేటయె సూటిమాట లవి చేటి! పెటిల్లని త్రుంచినట్లయెన్
నోటికి వచ్చినట్లనుచు నూరితి పళ్ళను, నన్ను వీడెనే.

**8. అభిసారిక**

కామము కన్నుగప్పగ వికారపు చేష్టలు వింత వర్తనల్
నీమము లేని పోకడలు నిత్యమసత్యము పల్కుచుండుటల్
ప్రేమని చేరు నా ప్రియుని పెద్దల కన్నులుగప్పి పుచ్చునా
భామిని కామినై వరలు భావ్యము నెన్నడు నెంచ దింతయున్.

**(మొబైల్: 9550467431)**





# ఎన్.వి. అనంతకృష్ణ

**1. స్వాధీనపతిక**

సీ. పరకాంత పొందుకై పరితాప పడనట్టి
  పతిని పొందుట నాకు వరము బలము
మనసు మెచ్చెడి రీతి మనియెద నీయందు
  మనసు నిండుగ నీవె మరువనెపుడు
నాకేల సాక్ష్యాలు నాకేల ఋజువులు
  నా స్వామి సన్నిధి నాకు సిరులు
యేనాటి పుణ్యమో యేనాటి భాగ్యమో
  ధన్యనైతిని నీదు దరిని నిలిచి
తే.గీ. ఏల నన్నిట్లు సాధింతువేమి స్వామి
అవును స్వాధీనపతిక నేనగుదునయ్య
నాదు చేతల బాధ్యత నీది కాదె
చేతమంతయు నీవౌచు చేరవయ్య.

**2. వాసకసజ్జిక**

సీ. ఆకొని వత్తువో యారగించగలవు
  మధురభక్ష్యములన్ని మనసుమీర
యేలా సుగంధాదు లెన్నెన్నొ తెచ్చితి
  పేర్మిని కర్పూరవిడెము కొరకు
కనుల కానందమ్ము కలిగించు రీతిగా
  విరుల పెక్కింటి నా కురుల తురిమి
క్షణమొక్క యుగముగా కలయజూచుచునుంటి
  చేరి సుఖము పొంద సిద్ధపరచి

తే.గీ. ఏల నన్నిట్లు సాధింతువేమి స్వామి
ప్రీతి వాసకసజ్జిక బిరుదదేల
నాదు చేతల బాధ్యత నీదికాదె
చేతమంతయు నీవౌచు చేరవయ్య.

**3. విరహోత్కంఠిత**

సీ. చంద్రోదయమ్మాయె జనుల కానందమున్
పంచుచు నాలోన పెంచె వేడి
కాలమాగినదేమొ క్షణమొక్క యుగముగా
గడువదే సమయమ్ము కరుణ మాని
రోషమ్ము ఖేదమ్ము రోదనాదులు నన్ను
కృంగదీయుచునుండె భంగపడితి
నెదురుచూపులు తప్ప యేమి చేసెదనయ్య
వత్తునంటివి మాట వట్టిపోయె
తే.గీ. ఏల నన్నిట్లు సాధింతువేమి స్వామి
విరసపు విరహోత్కంఠిత వేదన యిది
నాదు చేతల బాధ్యత నీది కాదె
చేతమంతయు నీవౌచు చేరవయ్య.

**4. విప్రలబ్ధ**

సీ. రమ్మని పిలుతువు రావదేటికి నీవు
రమ్మని రాకుంట రాజసమ్మె
చిలుక తత్తడి రౌతు చిందులు హెచ్చాయె
కుదురునుండగనీదు గుబులు పెంచు
నెవ్వాని నిందింతునీ దుఃఖమెటులోర్తు
వ్యాకులతను గూర్చ న్యాయమేమి
యనిన యంటినటంచు నాక్రోశమది యేల
మొగము చాటుగజేసి మోసమేల





తే.గీ. ఏల నన్నిట్లు సాధింతువేమి స్వామి
విప్రలబ్ధగ మార్చకు వేగలేను
నాదు చేతల బాధ్యత నీది కాదె
చేతమంతయు నీవౌచు చేరవయ్య.

**5. ఖండిత**

సీ. రాతిరంతయు రాక రాగమించుక లేక
పరకాంత పొందునే మరిగినావు
కండ్ల పడినవయ్య కస్తూరికాదులు
కమలినట్టి మొగము కాంత యెవతె
కోపరోషాదుల కొట్టుమిట్టాడగా
కంట నీరాగక కలతపడితి
నీ చేష్టలకు నాదు నిశ్వాసముల చూచి
దోషమాపాదించ దొరతనమ్మె
తే.గీ. ఏల నన్నిట్లు సాధింతువేమి స్వామి
యిటుల ఖండిత నేనంచు నీసడింపు
నాదు చేతల బాధ్యత నీది కాదె
చేతమంతయు నీవౌచు చేరవయ్య.

**6. కలహాంతరిత**

సీ. చెలుల సంగతి నుంటి చెప్పరాదనుటకు
నీదు చేతలయందు నీతి కలదె
అన్యకాంతలతోడ నాహ్లాదముగ గూడ
నన్యాయమంచు నిన్నడుగవలదె
తట్టుకొనగలేక తగవాడితినిగాని
ప్రేమ మెండుగనున్న బేలనయ్య
తప్పు నాదంచును తప్పించుకొనజూచి
యీర్ష్యాళువంచు నన్నిట్లు విడకు

తే.గీ. ఏల నన్నిట్లు సాధింతువేమి స్వామి
మరల కలహాంతరిత నంచు మాటలేల
నాదు చేతల బాధ్యత నీది కాదె
చేతమంతయు నీవౌచు చేరవయ్య.

**7. పోషితభర్తృక**

సీ. చెలి యింట కలదన్న చింతయే లేదేమి
దూరదేశమ్మేగి దొరకవాయె
పెదవి వణకసాగె విరులు బరువులాయె
తలపులు నిను వీడ తలచవాయె
చంద్రకాంతుల వేడి చందనమ్మున వేడి
తాపమించుక కూడ తాళలేను
మదను డదను చూసి మరి బాధపెట్టురా
చెప్పుకొనగలేరు చెలులు తప్ప
తే.గీ. ఏల నన్నిట్లు సాధింతువేమి స్వామి
యెన్న పోషితభర్తృక యెదద గనవె
నాదు చేతల బాధ్యత నీది కాదె
చేతమంతయు నీవౌచు చేరవయ్య.

**8. అభిసారిక**

సీ. నిను రమ్మని పిలువ నీవేల దరిరావు
గమనింతురెందరో కదలుటెట్లు
పూవింటి చెలికాడు పూని బాధించగా
తాపమ్ము హెచ్చెరా తాళుటెట్లు
తోడ్కొని నిను తేను తోడెవ్వరును లేరు
నిను వీడి నేనొంటి మనుట యెట్లు
నిన్ను పొందిన చాలు నిక్కమ్ము మోక్షంబు
గుట్టుగ నే రాగ గుర్తుకడకు





తే.గీ. ఏల నన్నిట్లు సాధింతువేమి స్వామి
తీరు యభిసారి కదటంచు దెప్పనేల
నాదు చేతల బాధ్యత నీది కాదె
చేతమంతయు నీవౌచు చేరవయ్య.

**(మొబైల్: 9246531895)**

# చిల్లప్పగారి అనిల జయదీప్

**1. స్వాధీనపతిక**

ఆ.వె. సాటిలేదు నాకు స్వాధీనపతికను
మాటతీరు మేలు మగువ నేను
సోగకనుల జూచి సోయగ మొలికించ
మగడు నిలువలేడు మనసు జార!

**2. వాసకసజ్జిక**

ఆ.వె. బాపుబొమ్మ నేను వాసకసజ్జిక
పద్మగంధమలది పతిని జేర
వేచిజూచుచుంటి వేల కనులతోడ
పడమటింటిలోని పడకగృహము.

**3. విరహోత్కంఠిత**

కం. విరహోత్కంఠిత నేనే
విరిశర పీడితను ప్రియుని వివశను కనరే
పరిమార్చెను నను మారుడు
పరిపరి చేతల కతముల పలుమారులుగన్.

**4. విప్రలబ్ధ**

ఆ.వె. విభుని రాకకొరకు వీధి మూలవరకు
నెదురుజూడ విసిగి యెఱుకరాక
విసిగి యాగ్రహమున విసిరి యాభరణాలు
విప్రలబ్ధ మారు వెలదినైతి.





**5. ఖండిత**

కం. వలవల వగచితి మరిమరి
కలలో పతి మతియొకతెను కామించెననన్
నెలతను నే ఖండిత వలె
కలవరమున కలహక్రోధకలితను నేనై.

**6. ప్రోషితభర్తృక**

కం. పొలతిని ప్రోషితభర్తృక
నలిగితి బొగలుచు మనమున నశ్రులు జారన్
ఇలు విడి నను విడి జనెనా
చెలికాడేడీ నుడువరె చెలియలు మీఋన్.

**7. కలహాంతరిత**

కం. అలరుల శరబాధితనే
కలకంఠిని నా విభునకు, గయ్యాళిగనే
కలహాంతరితను గానే,
కలహాలాడంగ నోప గలలోనైనన్!

**8. అభిసారిక**

కం. అభిసారికనై వచ్చితి
ఇభగమనపు టడుగుల వడి నిద్దరి జేరన్
విభు జూడగ వర్షించితి
నభవారాశుల కలుపుచు నయముగ తోడై.

# అన్నపరెడ్డి సత్యనారాయణరెడ్డి

**1. వాసకసజ్జిక**

భర్త వచ్చెడి వేళకు పడకటిల్లు
శుభ్రపరచి, విభూషించి సుందరముగ
మగని చిలిపిచేష్టలు మది సెగ రగుల్చ
కలల వాసకసజ్జిక కనుముదమున.

**2. స్వాధీనపతిక**

భర్త సతతమ్మును తనకు స్వంతమనుచు
నచ్చిన విధముగ మరల్చి మెచ్చుకొనుచు
కొంగునకు కట్టుకొనుచును కూర్మితోడ
మనును స్వాధీనభర్తృక మహిని తృప్తి.

**3. ఖండిత**

నమ్మిన ప్రియుడు కలలను వమ్ము చేసి
గడిపి రాత్రిని వేరొక కాంత గూడి
మరుదినమ్మున గృహమున కరుగదెంచ
పరుష వచనాల ఖండిత తిరుగబడును.

**4. విరహోత్కంఠిత**

పనుల యొత్తిడితోడ నా వరుడు గృహము
చేరకున్న మరుడు మది చేరి విరహ
వేదనను కలిగించగా ప్రియుని తలచి
తల్పమున విరహోత్కంఠిత తపియించు.





**5. కలహాంతరిత**

విభుని కోపభరమ్మున వెడలఁ ద్రోసి
వదలిపోయెడి పతిగని వ్యథ ప్రబలగ
చపలమైన మదికి ప్రయోజనమటంచు
వగచును కలహాంతరిత నివాసమందు.

**6. విప్రలబ్ధ**

చెప్పినట్టి ప్రదేశమ్ము చేరకుండ
ప్రియుడు మోసము చేయగ, వేచియుండి
రాత్రియంతయు మదిని నారాటపడుచు
విసరివేయును నగలన్ని విప్రలబ్ధ.

**7. ప్రోషితభర్తృక**

వరుడు దేశాంతరము చని పనులతోడ
చెప్పిన సమయమునకిల్లు చేరకున్న
చింతపడి చెలుల నుడుల శాంతిగొనక
వనరు కాంతయె ప్రోషితభర్తృకయగు.

**8. అభిసారిక**

వసతి నుండి యేకాంతమె బయలుదేరి
యన్ని యడ్డంకులను దాటి యెన్నుకున్న
చోటునకుఁ బ్రియుఁ గనుఁగొన బోవుచుండు
నామెయే యభిసారిక యనఁగ బరఁగు.

# పేరి వేంకటసూర్యనారాయణమూర్తి

## (అప్పాజీ)

1. **స్వాధీనపతిక**
   కాచిదుద్యోగినీ నారీ, సహోద్యోగి పతింవరా!
   బాహ్యాంతరేషు మనోజ్ఞా, నందయతిధవం సదా?

2. **వాసకసజ్జిక**
   భర్తృతుష్టిప్రదాత్రీ సదాభామినీ,
   నాకహర్షప్రదాత్రీ చ నాథప్రియా!
   స్వాం గృహాం మండయంతీ ముదా భర్తృగా,
   ప్రేమ సాత్కుర్వతీ స్వామి పుష్టిప్రదా!

3. **విరహోత్కంఠిత**
   గణనకార్య సంలగ్నం, స్వస్వామినం ప్రవీక్ష్యతే!
   కాచిద్విరహసంలగ్నా, ప్రతీక్ష్యతేధవం ప్రతి?

4. **విప్రలబ్ధ**
   విధిప్రయుక్తేవిలగ్నస్స(ః) భర్తా
   ప్రియా ప్రదత్తం నవచోప్రబుద్ధః!
   ధవస్యా శ్లిష్టమనుకాంక్షతీసా,
   వియోగబాధాం పరిభావితాన?





5. **ఖండిత**
   విధి ప్రకామేస్వపతిం విబుద్ధ్వా,
   చిరాత్ప్రవిష్టం స్వధామం విదిత్వా?
   పునః పునః క్రోధయితుం బభూవ,
   యతః పతిం కార్యభరం సుదృష్ట్వా?

6. **కలహాంతరిత**
   భర్తృ స్వకార్యం మనసా గృహాణ,
   స్వస్వం నిజప్రేమ గుణమాకలయ్యా?
   పశ్చాదభీష్ట ప్రియగచ్ఛతీసా,
   సైషా బభూవాత్మగుణ ప్రభూతా!

7. **ప్రోషితభర్తృక**
   దూరాద్వసం తం పతిం విభావయంతీ,
   సన్నిధి మాత్రేన శ్రుతం వచస్సా?
   వారం చ వారం ధవవార్తమేవ,
   ప్రాయేణసా భర్తృ వచస్స్మరంతీ?

8. **అభిసారిక**
   ప్రియ సమాగమార్తేయం,
   స్వకాంత సన్నిధిం ప్రతి?
   జ్యోత్స్నా దర్శన వేళాయాం,
   గంతు మిచ్ఛతి సాతదా?

# ఆరవల్లి శ్రీదేవి

**1. స్వాధీనపతికా**

సీ. విరులను కురులలో విరివిగా తురుమును
మరిమరి పొగడుచు మరులు గొలుపు
అధరము వణకగ యధరమునలదియె
కుదురుగ నుండడే కొంటెతనమె
వలపుల పలుకుల కలువను నేనని
లత్తుక పూయును లతలనలది
కంచుకమును తీయ కదలగ వదలడు
మెడ వెన్క నూదుచు మేలుకొలుపు

ఆ.వె. పున్నెమెంతొ జేయ పురుషుడై దొరికెనే
పదము క్రిందనైన పరచనీడు
స్వామి సరసనుండ 'స్వాధీనపతికనే',
మనసు నెరిగి మసలు మగడు వాడె!

**2. వాసకసజ్జిక**

సీ. పంచశయనముపై పరచగా మల్లెల
అల్లు పరిమళాలె యతివ భాష
పన్నీరు చిలికిన పల్చని పంచలె
కస్తూరి జవ్వాది గంధమలది
తెలిమబ్బు దుప్పటి తీర్చి సరిగ వేసి
సౌగంధతాంబూల సరసమచట
తానమాడి, తపన తరుణియె ద్వారాన
అలతి సిగ్గులొలక నందమలరె!





ఆ.వె. ముద్దుముత్యమొలుక ముగ్గుల మొగలియై
చందనమలదగను చక్కదనమె
వచ్చు సఖుని కొరకు 'వాసకసజ్జిక'
వేచిజూచునచటవిభునికొరకు !!

**3. విరహోత్కంఠిత**

సీ. ఈ రేయి వెన్నెల వేగించెనే యెద
విరహవీణా తంత్రి వేచి నిలువ
రాడేల సఖుడు? రాచరిక పనులా?
యెదురుజూచెడి వేళనేలరాడు
నిప్పులవర్షమై నిలువెల్ల దహియించె
వెన్నెల వెలుగులె కన్నెమదిని
నా సఖా యని పిల్వ నా ప్రాణముల నిల్ప
మదనుడై దీర్చరా మదనబాధ!

ఆ.వె. జలదమ! నిను బిల్వ జార్చవా సలిలమ్ము?
వలపుసెగల నార్ప వానధార!
కదువిరహ 'విరహోత్కంఠిత'యన,
తల్లడిల్లె మదిని తపనబడుచు!

**4. విప్రలబ్ధ**

సీ. కెంజాయ కిరణాలె మంజీరరవళులై
పలకరించగ వేచి పలవరించ
ఇపుడె వత్తుననుచు నీ తీవ వేచెనే
సంకేతమంపగా సామి రాడె
గడిచెనే సమయమ్ము కానరాడేలనో?
ఈ నిరీక్షణముల నిరవు గడిచె
అడుగుల సడియైన పడదేల చెవులలో?
ఏ దరికేగెనో? యిటులనైతి!

ఆ.వె. మాయమాటలాడి మాయజాలము చేయు
రాయబార మంపరావె చెలియ
దోషమంత నాదె, దొరయని నమ్మితి,
'విప్రలబ్ధ'నైతి, విరహమందు!

**5. ఖండిత**

సీ. కాంతలు విడిచిరా? కౌగిలి సడలెనా?
ముద్దుల ముద్రల ముచ్చటేన?!
కన్నులారగ జూడ కడుపు నిండెను సామి
కుంకుమ లలదిన కోమలి యెవ
రూరేగుదారుల నూరక వచ్చితో?
మోహయాత్ర ముగిసి ముద్దులలసి?
విన్నవి కనగను కన్నుల కెంపులే
విన్నపాలు వినను వెడలవయ్య!
ఆ.వె. కనుల నీరునిండ 'ఖండిత'కాంతయే
విసిరిగొట్టి వగచె విభుని జూచి
వీడిపోవుమనుచు వెక్కివెక్కి యేడ్చి
'ఈసు' నిండెను మనమింత 'చండి'!

**6. కలహాంతరిత**

సీ. తన్నేలుకొమ్మన తమ్మికంటికలుకె
మనసార మగడేగ మగువ బిగువె
లాలించి పిలవగా లలనకేమొ కినుకె
ఆ యలక, లవేలొ? యధర మదిరె
బ్రతిమాలి వెనుకేగ భామకే విసురాయె
మొండితనమదేమొ ముదిత ముడుపె
విడిచి యేగ ప్రియుడె వెతలపాలగు తానె
'కలహాంతరిత' యామె కలతజెందు!





ఆ.వె. చెలుడు చెంతరాగ జేరనీయ దలుకె
చెలియ చెప్పగాను తెలివినొందు
అలవికాని యలుక యలమటించు మదిని
ఇరుగుపొరుగు వినగ జరుగు రొదలె!

**7. ప్రోషితభర్తృక**

సీ. దేశాంతరము కేగ దీనమాయె బ్రతుకె
ఒంటరితనమదే తుంటరాయె
మొన్నె వత్తుననుచు ముచ్చటించె మగడె
ముంగిట చేమంతి మౌనమాయె
బంగారుపాత్రల రంగారు చందన
మెండిపోయి విరిగె మేలమాడి!
ఈ శిశిరచలుల నెటుల వేగుదు నేను?
కంబళి యాపదే! కఠినమాయె!
ఆ.వె. పొరలి పొరలి పడుచు 'ప్రోషితభర్తృక'
మగని కొరకు పొగలె సెగలె మదిని
కరిగి చెదరె బొట్టు కాటుక కన్నీరె
పడుచుప్రాయ మలసె పడతి యొరిగె!

**8. అభిసారిక**

సీ. జడివాన చూడదు నడిరేయి జంకదు
గాలి యడుగులేసి కదిలిపోవు
హృదయేశుని దరి యెద సడుల వినగా
పొదరింటి దాపుల పోయి జేరు
తెలిమబ్బు ముసుగేసి తేలి వెన్నెలరేయి
మిసమిసలవె దాచి మెసలి నడచు
కాల్గజ్జెరవళుల కంకణమ్ములు సేయు
సవ్వడి యణచియే సాగిపోవు!

ఆ.వె. పులుగుపుట్రలన్ని పూబాట లామెకే
ముళ్ళకంపలేవి కనులబడవు
నాల్గుదిశల జూచి 'యభిసారిక'గ నేగి
ప్రియుని జేరు సఖియె ప్రేమ పంచ!





## అర్క సోమయాజి ధూళిపాళ

1. **స్వాధీనపతిక**

ఎన్నడు నాదు మాటలన నించుకనైనను దాటవీవు! నా
కన్న యదృష్టమేరిది? మహోన్నత యోగమొ? నేనెఱుంగ! నా
కన్నుల సైగలన్ నడచు కాంతుడ వీవు! 'పరాయికాంత నా
కన్నను దీసిక'ట్టనెడు గాదిలి ప్రేమకు సాక్ష్యమీవెరా!

2. **వాసకసజ్జిక**

ఎన్ని దినంబులిట్లు తపియించి జపించితిరా! మనోహరా!
కన్నులు కాయలై గడప గావలి గాసితి! నీదు రాకకై
యన్నులమిన్ననైతి! విరహార్తిని బాపు భవన్మహద్విలా
సోన్నతి నూహ సేయుచు పరుంటిని రమ్మిక! జాగదేలరా!

3. **విరహోత్కంఠిత**

ఉన్నది చాలదంచు నను నొంటరిగా గృహమందు వీడి భా
గ్యోన్నతినంద నేగితివి! యొప్పులకుప్పకు సౌఖ్యమేదిరా?
నిన్నె తలంచు నా మనసు నిల్వదు! కానలగాచినట్టిదౌ
వెన్నెలయయ్యె జీవితము! వేళకు దిండియు, నిద్రలేమికన్.

4. **విప్రలబ్ధ**

మొన్నకు మొన్న! 'నీ కనుల ముందట వాలెద' జూడుమంచు నీ
వన్న పసిండిపల్కులు యథార్థము గావని దేల్చినావు! నీ
కెన్ని విధాల దెల్పనురా! యిట్లు తపించి, కృశించి నీకుగా
నెన్నొ యుగమ్ములం గడుపనేగెనురా విరహార్తి క్రుంగగన్.

**5. ఖండిత**

అన్నవలామణిం గలసి యచ్చట విందువిలాసమోద భా
గ్యోన్నతు లందివచ్చితి వహో! సెహబాసుర! ప్రేమనాయకా!
యన్నముగన్న నీకు పరమాన్నమె రుచ్యమునయ్యె! నేడు నీ
వెన్నిన యీ విధానమెవరేనియు విన్నను సిగ్గుచేటురా!

**6. కలహాంతరిత**

నిన్నెదిరించి పల్కితి! కనీసపు గౌరవమీయకుండ ని
న్నెన్నని మాటలంటి! క్షమియింపుమురా! కలహమ్ము వీడని
న్మన్నన గోరితి న్వెడలమానర! యీ తొలితప్పు కాయరా!
యున్నది జాలు! నింగిపయి నూయల లూగను! నన్ను నమ్మరా!

**7. ప్రోషితభర్తృక**

నిన్నని యేమి లాభమురా! నేనె ధనాశకు బోయి నిన్ను సం
పన్న విదేశవాసమని పంపితి! గావున నీవు నచ్చుటన్
దిన్నది లేదు! నాకిచట దేరగ తిండికి సొమ్ములంపి నీ
వన్నమొ రామచంద్ర! యన యార్తిని బొందగ నాకు సేమమే?

**8. అభిసారిక**

అన్నలుదమ్ములు న్నిదురయందు మునుంగగ జూచి, నిండుగా
సన్నని తెల్లచీర కనుచాటుగ జేసియు పండువెన్నెలన్
నన్ను సివారుతోటకు, జనమ్ములు లేని పరాయిచోటుకున్
తిన్నగ రమ్మనంటివిర! తేకువ యేలర? సాధ్యమౌనురా!

**(మొబైల్: 94417 75788)**





## డా. బల్లూరి ఉమాదేవి

తే.గీ. అష్టవిధమైన నాయిక లవనియందు
గలరటంచును దెలిపిరి కవులు మునుపు
వారిని గురించి తెలిపెద వాసిగాను
నాలకించగ రండిట కార్యులార!

**1. స్వాధీనపతిక**

తే.గీ. పతియు వచ్చునటంచు తా పడకటింట
సర్వసన్నద్ధయగుచును సంతసాన
విరులమాలను దాల్చుచు కరమునందు
నాశతోడ నెదురుజూచు నతివ తాను.

**2. వాసికసజ్జిక**

తే.గీ. భర్త రాక కెదురుచూచు పరవశాన
సదనమును తన తనువును చక్కగాను
సరసురా లిల వాసికసజ్జిక యన
నొప్పుచుండె నా యిల్లాలు నుత్సుకతను.

**3. విరహోత్కంఠిత**

తే.గీ. పనులయందు నిమగ్నుడై పతియు రాక
యున్న విరహవేదనతోడ నుస్సురనుచు
వేయి కనులతో చూచుచు విభునికొరకు
నార్తినొందుచు నుండు తా నహరహమ్ము.

**4. విప్రలబ్ధ**

తే.గీ. ప్రియుని కొరకు రేయంతయు ప్రేమతోడ
వేచినను వాని గానక విరహబాధ
పెచ్చుపెరుగ నాభరణము ల్విసిరి వైచి
పతి యొనర్చు మోసమునకు వగచుచుండు.

**5. ఖండిత**

తే.గీ. పరవనితను గూడి మరలి వచ్చినట్టి
పతిని మన్నింపజాలక వగచుచుండి
ఖ్యాతి కెక్కెను భువిలోన ఖండిత యన
నాగ్రహోదగ్రయైనట్టి యతివ తాను.

**6. కలహాంతరిత**

తే.గీ. చపలబుద్ధిని చూపుచు సంయమనము
వీడి విభుని వదలివైచి పిదప మదిని
పరితపించుచు విలపించు పతిని తలచు
వనిత కలహాంతరిత యన వాసికెక్కె.

**7. ప్రోషితభర్తృక**

తే.గీ. దూరదేశమేగ పతియు దుఃఖపడుచు
నతనికై చింత చేయుచు నహరహమ్ము
పలవరించుచు ప్రోషితభర్తృక యన
భువిని పేరు పొందినయట్టి పొలతి తాను.

**8. అభిసారిక**

తే.గీ. వేషభూషలు మార్చుచు ప్రియుని కడకు
నేగు సంకేతస్థలమున కిమ్ముగాను
రాత్రివేళలయందు నరహిని బూని
తానె అభిసారికాఖ్యయౌ ధరణియందు.

**(మొబైల్: 9493846984, 7588673344)**





# భారతి రామచంద్రుని

**1. స్వాధీనపతిక**

కం. మరులను 'స్వాధీనపతిక'
విరితూపులు విసరి పతిని వివశుని జేయన్
సరిపోయె నతని సమయము
చిరుచందన మలది సతికి చెలువము బెంచన్!

**2. వాసకసజ్జిక**

కం. పనిపై దూరపుటూరికి
జనినంతనె పతిని దలచి సతి విరహిణియై
తనువున 'వాసకసజ్జిక'
ఘనమగు భూషలను దాల్చి గాంతులు జిమ్మెన్!

**3. విరహోత్కంఠిత**

కం. మరుమల్లెల పానుపుపై
విరహంబున బొరలుదాన 'విరహోత్కంఠీ!'
సరసము దెలియని ప్రియుడని
విరసంబున మనసు విరిగి వేదన పడితే?

**4. విప్రలబ్ధ**

కం. మోసము జేయగ ప్రియుడే
వేసారెను 'విప్రలబ్ధ' వేదన తోడన్
తీసిన నగలను విసరుచు
నాసలు దీరకను మదిని నాక్రోశించెన్!

**5. ఖండిత**

కం. చెక్కిలిపై కాటుక గని
నిక్కముగా జెప్పుమనుచు నిలదీయుచు నా
టక్కరి ప్రియునికి 'ఖండిత'
చక్కని సన్మాన మొసగ సమరము జేసెన్!

**6. కలహాంతరిత**

కం: కలహించుచు చెలికానిని
వెలివేయగ నతడు వెడలె విడివడి గృహమున్
మలిసంధ్యను మునిమాపున
'కలహాంతరిత' తడికనుల గడపన నిలిచెన్!

**7. ప్రోషితభర్తృక**

కం. సౌదీ కేగిన పతికై
ద్వైదీభావంబుతోడ తరుణియు నేడ్వన్
సేదను దీర్చగ చెలియలు
వేదనతో నెదురుజూచె విరిమాలలతో!

**8. అభిసారిక**

కం. అభిసారముజేరుటకై
'అభిసారిక' పరుగుబెట్టె నడవుల నడుమన్
సొబగులు ముసుగున దాచుచు
విభు సన్నిధి గోరి నడిచె వెన్నెలరేయిన్!





## బ్రిం

**1. స్వాధీనపతిక**

ఆ.వె. ఇరుగు పొరుగువారు ఏమైన అనుకోని
భర్త హెల్పు పొంద భార్య లక్కు
చాటుకుండ నన్ను స్వాధీనపతికన
ఏమి లెక్క జేయ నేడ్వనిందు.

**2. వాసకసజ్జిక**

ఆ.వె. జాస్మిను విరిదండ జడలో తురుముకొని
వైటుకలరు శారి నీటు గట్టి
వైపు కన్పడవలె వాసకసజ్జికై
నవ్వుమోముతోడ లావు జూపి.

**3. విరహోత్కంఠిత**

ఆ.వె. ముద్దుముచ్చటాడి మురిపాలు తీర్చదు
కలుగ కోర్కె తనకు నిలువనీడు
వేగిపోవుచుంటి విరహోత్కంఠితై(నై)
సిగ్గు విడిచి ఏమి చెప్పగలను?

**4. విప్రలబ్ధ**

ఆ.వె. అతడు రమ్మనియెను ఐమాక్సు హాలుకి
తాను లేడు సరియ ఫోను ఆపు
వెర్రిదాన నేను విభువంచితగనైతి
పురుషులందు వేరు పుణ్యులెవరు?

**5. ఖండిత**

ఆ.వె. చాటుగాను చేయు సరసాల కథ తెల్సె
మీదు రాసలీల మితులు దాటె
చాలునింక పోదు పోలీసు ఠానాకు
కచ్చ తీర్చుకొమ్ము ఖండితగుచు.

**6. కలహాంతరిత**

ఆ.వె. గరలు ఫ్రెండుతోడ సరసమాడేతెంచ
హాటు హాటుగాను తాట తీతు
గాని జాలి పొంది కలహాంతరితనౌదు
కక్ష మిగుల కూలు కాపురమ్ము.

**7. ప్రోషితభర్తృక**

ఆ.వె. పాడు నిద్ర ఇపుడు పట్టవే ముంచెత్తి
తాను వచ్చినాక దరికి రాకు
పొందు ఆశ దీర ప్రోషితభర్తృకై
పవలు రేయి మరచి పరవశింతు.

**8. అభిసారిక**

ఆ.వె. నైటు టెన్ను దాక నాథుండు రానిచో
పబ్బుకైన నైటు క్లబ్బుకైన
ఆటొనెక్కి పోదు అభిసారిక నగుచు
రిస్కు కనక హెచ్చు రేటు అనక.





## చావలి బాలకృష్ణవేణి

**1. స్వాధీనపతిక**

ఉ. రాచరికంబునందు కడు రాపిడియందున నుండు రాజుకై
తోచినవన్నియున్నెసలుఁతో యజనేత్రుఁడు నెక్కొనన్నతిన్
జూచి, మనోరథానుగమి జోతల మెప్పును బొందనందగా
నా చిరకాల సంతసము నా కనుదోయిని సాధితాంగనై...!

**2. వాసకసజ్జిక**

ఉ. వేగులవార్తకై యెదురు వీధుల వెంబడి జూఁచితావిధి
న్నాగని దుర్భరమ్మునగునాదటమీదట విప్రలంభయై
లోగటివై, సరాగలులిరోచన వంచనఁ బ్రాణనాథుకై
మ్రోగెడి వీణ, మంజులపు మువ్వలు ఘొల్లనె లేమ తోఁడుతన్..!

**3. విరహోత్కంఠిత**

ఉ. వచ్చెదనంచు తా మఱచి బాధ్యతలెన్నియొ మీదనుండగా
సొచ్చిన నా హృది న్గనకశోణిత నేత్రము లెక్కచేయకే
ముచ్చిలిగానునైన నను ముద్దును దీర్పని మోటుగాడుగన్
మెచ్చుచునుండితి న్మనిషి మేలును కూర్చునటంచు నమ్మికన్..!!

**4. విప్రలబ్ధ**

ఉ. అంతిపురంబులోనగల యంగన లెల్లరి కళ్ళు గప్పి నే
పొంతల దారిలో బిగువు మూలగనుండెడి కుంజసన్నిధిన్
చింతిల రేయినంతయును చేరగరాని మనోనురాగుకై
మంతనమందునే యతని మంజురసాన్విత మోహమందుదున్ ...!!

**5.** **ఖండిత**

ఉ. చేసిన తప్పులెప్పుడును జెప్పకనుంటివి మోసగింపగన్
చూసెదు కన్నులన్వదలి జూపెదు కల్లపు నెమ్మి నమ్మి నా
యాసలు బుగ్గియౌ తరిని నర్మిలి దొక్కుచు రేయియంతయున్
కోసిన నా హృదిన్జలుప గుట్టుగనుండక పోరు సల్పెదన్ ...!

**6.** **కలహాంతరిత**

ఉ. గోముగ బిల్చి నన్నెగిరి క్రోధితనై పలుకొండెముల్దగన్
మేమను మాటనే మఱచి మేనన సెగ్గముఁదగ్గఱింపకా,
సామియె నిల్లు దాట పలుసారులుఁ దప్పులు నొప్పుచున్నమం
బౌమరుడన్న బాధపడు భామనుతాపముఁ బొందుచుండగన్..!!

**7.** **ప్రోషితభర్తృక**

ఉ. దేశవిదేశము ల్బడుచుఁ దీరుగ నుండక క్రుమ్మరంగ నా
వేషములన్నియున్నెలగ వేదన మాత్రము దక్కుచుండగా
పాశమునందునున్న చెలి బాహ్యము నొందుచు రుచ్యచింతనన్
ప్రోషితభర్తృకై నిరతి పోషక సామినిఁ గోరుచుండగన్..!!

**8.** **అభిసారిక**

ఉ. తానభిసారమందు జనతత్పతికై పెనునడ్డగింపులన్
వానల వంకలన్మునిగి పాములఁ దేళ్ళను ద్రొక్కుచున్నడున్
పేనము లెక్కజేయకయె ప్రేముడి శ్వాసగ సాగిబోవుచున్
కోనల గుట్టల న్దిరిగి గోపనముం ప్రియవల్లభున్గనన్ ...!!

(మొబైల్: 8341353323)





## చింతా రామకృష్ణారావు

**1.** **స్వాధీనపతిక**

చం. తన యనురాగహేలను ముదంబును గూర్చెడి రుక్మిణీసతిన్,
మనమున నిల్పి, యామె యభిమాన సుఖప్రదమందిరం బహో!
వినుత ముకుంద! వీడవుగ, విజ్ఞత క్రోల్పడి భామ ప్రేమచే.
తనకు వశుండవై చెలగ తాను రహించెను నీదు ప్రేమచే.

**2.** **వాసకసజ్జిక**

ఉ. వచ్చెదవీవటంచు నట వాసకసజ్జిక సత్యభామ. తా
నిచ్చ నలంకరించుకొని, నేర్పుగ తల్పమలంకరించి పల్
ముచ్చటతోడ నిన్గవసి పోఁడిమి నొప్ప నుపేక్ష చేయ నీ
విచ్చట కృష్ణ! భక్తులకనేకుల బాధలు బాపవచ్చితే?

**3.** **విరహోత్కంఠిత**

చం. విరహముచేత కల్గ నిట వేగిరపాటు, భరింపలేనిదై
సరగున చేరె పొన్నునకు చప్పున జాంబవతీ లలామ. నీ
వరుగుము కృష్ణ! యామె మది నార్తతఁ గాంచి సుఖింపఁజేయగా..
పరిపరి నీదు భక్తులనె వర్ధిలఁజేయుచు గాంచవా సతిన్?

**4.** **విప్రలబ్ధ**

మరచితొ? మిత్రవింద కట మాట నొసంగితి వీవు, రాత్రికిన్
మరువక వత్తునంచు. మరి మాటను మీరితివేలనయ్య? యా
తరుణిని విప్రలబ్ధగను ధాత్రిని మార్చితి వీవె కృష్ణ. సుం
దరమగు మేని సొమ్ములను తా పెకలించి విదల్చె కోపియై.

**5. ఖండిత**

ఉ. భద్రతఁ గొల్పి సాధువుల వర్ధిలఁజేయగ రాత్రి నీవహో
నిద్రను మానియుండుటను నీ కనులెఱ్ఱగ నుండుటెన్ని నీ
భద్ర 'పరాంగనన్కలిసి వచ్చితివంచు' భ్రమించి కోపియై
ఛిద్రము చేసె వస్తువులు శ్రీహరి! ఖండిత నెట్లు మోసెదో?

**6. కలహాంతరిత**

ఉ. కోపము చెందె నీ మరులు గొల్పెడి మాటలకాసుదంత.. సం
తాపముతోడ నిన్విడిచె దర్పముతో. మదిలోన నిన్ను తా
కోపము వీడి రావలచి చింతిలుచుండెను. గాంచితే హరీ!
హా! పరమేశ! యంచు కలహాంతరితాత్మఁ గృశించె. గాంచితే?

**7. ప్రోషితభర్తృక**

ఉ. నందకుమార! కార్యములనంతము చేయఁగ నిల్లు వీడ, కా
ళింది మనంబునన్వగచె క్లేశము నొందుచు నీవు లేక తాన్.
సందడి చేయు నీవచట చక్కని ప్రోషితభర్తృతు. కన్గనన్
సుందరి సంతసించు, మది శోభిల పల్కును. నిన్ను గాంచినన్.

**8. అభిసారిక**

ఉ. సన్నుతితోడ నిన్ను కనుసన్నల రమ్మను చోటు చేరగా
నన్నులమిన్న లక్షణ సమస్త భయంబులు వీడి వచ్చి నీ
కన్నుల ముందట న్నిలిచె కష్టములెన్నిటినైన నోర్చి. సం
పన్నత నొప్పు నామెకగు భవ్యముగా నభిసారికా ప్రియా!

**(మొబైల్: 82473 84165)**





# ధనికొండ రవిప్రసాద్

**1. వాసకసజ్జిక**

సీ. పుస్తకమ్మొకటుండె హస్తమ్మునందున
    మస్తకమ్మే వ్యథాగ్రస్తమయ్యె
అక్షరమ్ముల జూచు నభినయమ్మే యుండె
    నక్షరమ్మగు రూప మదియె నిలచె
'ప్రతిదిన మ్మేదియో వంకతో వచ్చు మో
    హనుడేల రాకుండె నక్కజముగ?
అతని మదిని దోచు నాకు పచ్చనిచీర
    నేను కట్టుట వ్యర్థమౌనె నేడు?

గీ. మెల్లమెల్లగ జడలోని మల్లెపూల
గంధ మాతడాఘ్రాణించి క్షణము, క్షణము
పరవశించెడు మధురానుభవము నేడు
దక్కునా?' యని రమణి చింతన్కృశించె.

(నాయికరమణి. నాయకుడు మోహన్. ఇక్కడ మల్లెపూల గంధం ఆఘ్రాణించట మంటే ప్రయత్నపూర్వకంగా అతడు ఆఘ్రాణించటం కానక్కరలేదు. ఎదురుగా ఉన్న పురుషుడు ఆ సువాసనని అప్రయత్నంగానే పొంది పరవశిస్తాడు.)

**2. విరహోత్కంఠిత**

సీ. 'ఏమియో! మోహనుడేల రాకుండెనో
    కార్యాలయమె తన కాపురమ్మొ!
కాపురమ్మును జేయ కలియునా సమయమ్ము
    వీనితో నేనెంత విసుగవలయు!
కార్యాంతరమ్మున కాలమ్ము మించెనో!
    అనుమానములు నాకు నధికమయ్యె

చరవాణి మ్రోగిన న్వరికింపడాయెనే!
సందేశమును గూడ జదువడేమి!
గీ. ఏ ప్రమాదమ్ములోనైన నిరికెనేమొ!
లేదులే! మార్గమున రద్దీ, యేదొ జరిగె'
ననుచు పలువిధముల మోహనునకు జుట్టు
నూహలను బెంచి యలసి నిట్టూర్చె రమణి.

**3. ఖండిత**

సీ. వేచివేచి మనమ్ము వేసారి పోవగా
నరుదెంచ మోహను దతని గాంచి
"ఇంతి ప్రేమను జూప నింత కాఠిన్యమా?'
యనుచు గద్దించిన దతివ రమణి
"ఒక సహోద్యోగినికొక సాయమొనరింప
నాలస్యమాయె" నంచతడు పలికె
ఖండితమ్మైపోగ గుండె యొక్క క్షణాన
రమణి యిట్లనియె వాగ్రయము మించ
తే.గీ. "అంత ఆత్మీయురాలొకో! అందమైన
దేమొ! నను మరిపించెడు భామయేమొ
బుట్టలో వేసె నిన్నది, పురుషునందు
నమ్మకమె నాదు తప్పు, సత్యమ్ము తెలిసె."

**4. కలహాంతరిత**

సీ. రమణి పొందిన యపార్థము బాపనేయొట్టు
ఫలము నీయక తాను కలతజెంది
ముఖము వాడినయట్టి మోహనుడామెకు
విశ్రాంతినిచ్చి తావెడలిపోయె
పూనకమ్ము వదలిపోయినదోయన
రమణి సాధారణ రమణియయ్యె





"ఇంతుల కావేశమింతయుండు నటంచు
నీ క్షణమందె నాకెరుకయయ్యె
గీ. కట్టుకొనక ముందే యిట్టి కఠినమైన
నింద మోపగ నతడు మన్నించునెట్లు?
మృదుమధుర పాయసము నాదు పెదవికంద
చేదనుచు నూసితి" నటంచు చింతగ్రుంగె.

**5. అభిసారిక**

సీ. తన నిందలకు పరితాపమొందిన మోహ
నుడు తనపై ప్రేమ విడచునేమొ
యని చింతనొందు భామిని తాపమును బాపు
చరవాణి సందేశమరసి మురిసె
"మా మల్లెతోటలో మనము లోనున్నట్టి
కోపమో, తాపమో చూపవచ్చు"
ననెడు నా సందేశమరసినంత రమణి
యొడలెల్ల పులకింప వడిగ కదలె
గీ. ముద్దుమోమున మూగెడు ముంగురులను
సరిగజేయదు, పైటయు జారుచుండ,
నెటకు బోయెదవను ప్రశ్నలేమి వినక
కరివరదు రీతి తోటకు కదలిపోయె.

('ఏ పరివారమ్మును జీరడు. ఆకర్ణికాంతరధమ్మిల్లము చక్కనొత్తడు' అనే రీతిలో ఆ మహావిష్ణువు ఎలా వెళ్ళిపోయాడో అలా ఈమె ప్రియుని కోసం వెళ్ళింది. ఆమె అలంకారాన్ని కూడా చూసుకోలేదు. పోతనగారికి క్షమాపణలతో.)

**6. విప్రలబ్ధ**

సీ. మెల్లమెల్లగ తాను మల్లెతోటకు బోవ
నలవాటు పడిన యయ్యతివ రమణి
యొకనాడు తోటలోనికి వత్తుననియు మో
మాటాన, ప్రియుడు తా మాటదప్ప

నలిగె నాతనిపైన, నలిగె చిత్తమ్మెల్ల
నలిపె వాల్జెడన పూవులనుబట్టి
కారమ్ము తీపియు కానట్టి యా తీయ
నగు బాధ యొడలెల్ల నలముకొనియె

గీ. తోటలో మల్లెపూలను ద్రుంచుచుండె
తెల్లబోయినదా మోము మల్లెవోలె
వడివడిగ వచ్చి గొలుసుల వదలివైచె
గొలుసుగా దుఃఖభావమ్ము లలముకొనియె

(దుఃఖభావాలు ఒకదాని వెంట ఒకటి గొలుసుగా వచ్చాయి. అలిగెనాతనిపైన అని, నలిగె చిత్తమ్మెల్ల అంటే మనస్సు నలిగిపోయినదని గ్రహించగలరు. ఆమె ముఖం తెల్లబోయినా ఆ తెలుపు మల్లెపూవులాగానే అందంగా ఉంది)

**7. ప్రోషితభర్తృక**

సీ. ప్రతిదిన మ్మొకమారు వచ్చు మోహనునకు
బదిలీయె గుండెలో బరువు నింపె
సూర్యోదయము కాక స్రుక్కిన కమలమ్ము
కరణి రమణి ముఖకమలమలసె
చరవాణి రవిక దాచక వేరెయుంచదు
సవ్వడికే గుండె జలదరించు
మోహను పలుకులే మోహనరాగ మం
చెదురు జూచుచునుండు హృదయమెపుడు.

గీ. మోహనుని పిల్పు కానిచో ముఖము ముడుచు
దిండు బిగికౌగిటన్జేర్చు, దిగులు పడును
కనులు మూసిన న్దెరచిన న్కలలె వచ్చు
కలలు నిజమౌట యెపుడను కలతవచ్చు.

**8. స్వాధీనపతిక**

సీ. తన మెడ న్తాళిగట్టిన మోహనుం డెంత
ధన్యుడో యని మదిన్దలచి మెచ్చు





సత్యాపతి న్పోలు సాత్వికుడౌ భర్త
జడన మల్లెలు వెట్ట నొడలు మరచు
తన శరీరమ్మునందున ప్రతి కణములో
వాంఛ నాతడెరుంగ పరవశించు.
చిరకాలముగ నిరీక్షించిన యా బాధ
యానందమును బెంచెననుచు మురియు

గీ. రతి యనగ కొన్ని యంగాల రక్తి కాక
తనువు, మనము, నాత్మయు నిండి తపన బాపు
కళగ నెరిగిన మోహనున్గలసినంత
రమణి తనువీణ మోహనరంజితమగు.

(మొదటి పాదంలో సంతృప్తితోపాటు ఒక అహం ఉన్నది. తన మెడలో తాళికట్టి తన భర్త ధన్యుడైనాడనే స్వాధీనపతికా భావం. అలాగే తన భర్తని కేవలం కృష్ణుడిగా మెచ్చక సత్యాపతిగా మెచ్చటం. ఆ పూలు పెట్టటం పారిజాతాపహరణాన్ని స్ఫురింపజేయటానికి.)

(గమనిక: అష్టవిధనాయికలని వేరువేరు పాత్రలుగా కాక ఒకే నాయికా నాయకులతో ఒక ప్రేమకథగా వ్రాశాను.)

**(మొబైల్: 99639 07947)**

దూరప్రయాణమున కేగిన ప్రియుని రాకకై
సర్వాలంకృతయై ఎదురుచూచు నాయికే వాసక
- వాసక సజ్జ.







## డా. జంధ్యాల జయకృష్ణ బాపూజీ

**1. స్వాధీనపతిక**

(స్వాధీనుడైన పతిచేత నిరంతరం లాలింపబడే రమణీమణి. ఆమె స్వరూప స్వభావాలు ఆమె పలుకులలోనే అవలోకించండి)

సీ. కల్వపూదండనే కంఠమందున వేయు
    సన్నజాజుల చెండు జడను తురుము
"చెలి! చంద్రముఖి!" యంచు చిబుకమ్ము స్పృశియించు
    మెల్లమెల్లన జేరి మేను నిమురు
పద్మమ్ములని నాదు పాదాలనే పట్టు
    పొందిక పారాణి పూయుచుండు
మంచిగంధము నద్ది మరపించు మనసును
    నవ్వులాటలకైన నన్ను విడదు
తే.గీ. మందహాస మొనర్చిన కందళించు
కొసరి చూచిన మాత్రనె కోర్కె దీర్చు
ముద్దుపెదవిని పెదవిడి మురిసిపోవు
చేత చెయి వైచి బాసల జేయు సఖుడు.

**2. వాసకసజ్జిక**

(పుష్పశయ్య సిద్ధపరచి ఆభరణాల నలంకరించుకొని భర్త ఆగమనం కోసం నిరీక్షించే సుగుణసుందరి. ఆమె మాటలు ఆలకించండి.)

సీ. హంసతూలిక పాన్పు నమరించితిని నేను
    వింజామరల తోడ వీతు పతికి
పట్టుచీరను కట్టి పన్నీరు చిలికింతు
    మేలి యత్తరులనే మేన పూతు

కస్తూరి జవ్వాది గమగమల్ గురిపింతు
మిసిమి యాభరణాలు మెరయజేతు
కాటుక కన్నులన్ కలలన్ని పండింతు
కౌగిళ్ల విందులో గరగిపోదు
తే.గీ. కలికి కుంకుమ రేఖలు కరగవలయు
కురుల దాగిన విరులన్ని కురియవలయు
గంధ పుప్పొడులన్నియు కదలవలయు
నడుము ముత్యాలసరులన్ని నవ్వవలయు.

**3. విరహోత్కంఠిత**

(పతి విరహానికి తట్టుకోలేక పదేపదిగా కలవరించి వేదనతో తల్లడిల్లే తరుణీ లలామ. ఆమె విరహవేదన గమనించండి)

సీ. ఏడేడి? నా నాథు డెక్కడుండెనొ కదా!
యేగెనే నిమిషమ్ము లెన్ని యెన్నొ
చలిగాలి చెలరేగె గిలిగింతలవి మీరె
చెలికాడు రాడాయె, చింత మిగిలె,
శుకముల పలుకులు, పికముల పాటలు
గుచ్చుచుండె చెవుల గునపములను
నెమిళుల నృత్యాలు నీరస మ్మిడుచుండె
చెలునికై వెడలిన చెలియలేరి?
తే.గీ. కరకు శరములు వేయకు కఠిన మదన!
పూలబాకుల గుచ్చకు బేలనయ్య!
తనువు లేకున్న నీవైన తరలిపోయి
ప్రియుని కెరిగించి నా బాధ పిలువలేవ?

**4. విప్రలబ్ధ**

(సంకేతస్థలానికి తనని రమ్మని తాను రాని పతిని తలచి ఆభరణాలు తీసివేసి విలపించే లావణ్యవతి. ఆమె విలాపాలాపాలు వినండి.)





సీ. ఇటకు నను పిలచి యెటకు నీ వేగితి?
విది నీకు దగునయ్య? యెదయె లేద?
కన్నీరు పొంగెను, కలతబారె మనస్సు,
ప్రియకాంతపై నున్న ప్రేమ యిదియ?
ఈ యందె లెందుల? కీ కాంచి యెందుకు?
వజ్రాల హారాలు వలదు వలదుబీ;
మణికంకణము లేల? మణికర్ణిక లవేల?
రత్నాంగుళులు వద్దు; రమ్ము నీవు;
తే.గీ. అన్ని దిశలను నీ రూప మదియె కంటి;
నంతరంగము నందున నంత నీవె;
గమ్య మెరుగను కాలము గడచుచుండె
వేచియుంటిని హృదయేశ! వేగ రమ్ము!

**5. ఖండిత**

(రేయంతా పరకాంతా సంగమంతో గడపి యింటికి వచ్చిన మగని దేహం మీద గుర్తులు చూచి ఆగ్రహించిన అతివ. ఆమె కోపభాషణలు ఇలా ఉంటాయి.)

సీ. కలికితో రేయంత కులికి వచ్చినవాడ!
పొమ్ము మొగము వంచి పోకలాడ!
చెంపగంటు లివి యే చినదానివో తెల్పు?
మెడనున్న కాటుకే మెలతదోయి?
చిబుకాన కొరికిన చెలియ పేరేమోయి?
పసుపాయె పంచెపై పడతి యెవతె?
నుదుట కుంకుమగుర్తు నుదువు మెట్లాయెనో?
చందన మలదె నేసుందరాంగి?
తే.గీ. ఎర్రజీరలు కనులందు నెందుకయ్యో?
అలముకొను చిరుచెమటల కర్థమేమి?
మేన పన్నీటి వాసన మించుటేల?
కదలు మటకె కిమ్మనకుండ గ్రంథసాంగ!

**6. కలహాంతరిత**

(రోషంతో, ఈర్ష్యతో, అసహనంతో ముందుగా ప్రియుని ఆక్షేపించి పిదప పశ్చాత్తాపపడే ప్రణయభామిని. ఆమె తీరుతెన్నులు తిలకించండి.)

సీ. ఉలుకను పలుకను నోర్వను నిన్నింక;
నా వేదనల జాలు నాపజాల;
నేకాంతనో గూడ నెచటికో నేగావు;
నీ కాంత నేమార్చి నిలచినాడ;
వే రీతి వచ్చితి? విప్పుడే తెలిసెనా?
యనురాగరహితుండ! యాటలేల?
మేనబావ వటంచు మెండుగా నమ్మితి;
లాలనల్ మానుమా లలన జేరు;
తే.గీ. మకట! పలుకుల ములుకులనన్ని విసరి
యోచనము లేక నావేశయుక్తనైతి;
నిట్టు లాలస్యమైనందు కట్టులంటి;
మాట మన్నింపు చెలికాడ! మనసు నెరుగు.

**7. ప్రోషితభర్తృక**

(దూరతీరాలలో నివసించే భర్తను తలచుకొని తలచుకొని పరితపించే మహిళా తిలకం. ఆమె పరితాపం పరికించండి.)

సీ. ఎన్నాళ్లు గడచెను ఎన్నేళ్లు నడచెను;
రాడాయె నాథుడు; రాదు వార్త;
కలలోననైన నిన్గనుగొందు ననుకొంటి;
రాదుకద నిదుర; రావు కలలు;
విరహపు వ్యథలోన వేగెను హృదయము;
కన్నీట కరగెను కాలమంత;
తీయని యూహలు తెరలోననే యుండె;
నవ్వుపువ్వులు లేవు నా పెదవుల;





తే.గీ. తనువు చిక్కెను; నిట్టూర్చి మనసు స్రుక్కె;
పచ్చకప్పుర పలుకుల తెచ్చి పూయ;
చల్లచల్లని పన్నీరు చల్లినంత;
తపము, తాపము తీరునా తాను రాక?

**8. అభిసారిక**

(వయ్యారి నడకతో గుట్టుమట్టుగా చెలికాని కోసం వెన్నెలలో సాగిపోయే యువతీ లలామ. ఆమె పలికే చిలుక పలుకులు ఆలకించండి.)

సీ. శ్రీకారముల వంటి చెవులమ్మ సఖునివి;
సరసభాషణ సల్పు చక్కనయ్య;
నిగనిగల్ ప్రసరించు నిడుపైన దేహమ్ము;
పగతుర నెదిరించు పౌరుషమ్ము;
రారాజు రేరాజు రసరాజు రతిరాజు
అతడదే నిలుచుండె నా పొదకడ;
సడిచేయ కేగెద సంపంగి! కదలకే;
కూయకే కోయిలా! కొంచెమాగు;
తే.గీ. కాలియందెలు తొలగించి; మేలిముసుగు
వైచి; వజ్రాల గాజులు పైకి త్రోసి;
ముగ్ధధవళాంశుకాంబరములను దాల్చి
వెండివెన్నెల వేవేగ వెడలుచుంటి.

## డా॥ వజ్జల రంగాచార్యులు

**1. స్వాధీనపతిక**

శా. చీరల్జుట్టును, చెంతజేరి కురులన్జేపట్టి చిత్రమ్ముగా
మూరన్గొల్చుచు పూలుబెట్టు ముఖమున్ముద్దాడు మోహమ్ముతో
కూరల్గోయును వంటకై వనిత తాకోరంగచిత్రాలకున్
దారిన్దీయును భర్తయన్న యతడే తద్భార్యకున్వశ్యుడే.

**2. వాసకసజ్జిక**

మ. సతతస్పర్శ చమత్కృతీ క్రియలతో స్వర్గాలు చూపించునా
పతి సాయంత్రము జేరు నిల్లు కొలువు న్వర్జించి శయ్యాదులన్
కుతుకం బొప్పగ సర్ది యందముగ ముంగొంగు న్వసిండౌ పతిన్
రతికేళి న్తనుపంగ సిద్ధపడె భార్యారత్నమా ప్రొద్దునన్.

**3. విరహోత్కంఠిత**

చం. కనులను మూయలేను, తమకమ్మును నాపగలేను, కొల్వు వీ
డిన వెనువెంట నింటికి వడిన్బరతెంచెడి వాడిదేమి నే
డినుడట పశ్చిమాద్రి దరినింకినగాని గృహమ్ము జేర డా
తని మధురార్ద్ర చుంబనమునన్నిటుల న్విరహాన గాల్చెడిన్.

**4. విప్రలబ్ధ**

ఉ. పూవులు గాజులీపునుగు పొల్పిట దేనికి, పట్టుచీరనే
కావలెనంచు గోరితిన? కంజదళాక్షి బిరానవత్తు, నె
త్తావులతోట ద్రిప్పెద మదర్పిత చిత్తముపైన నాననో
దేవి యటన్నవాడెట విధేయుడునై వెలయాలి జేరెనో?





**5. ఖండిత**

మ. తనువంత న్సిరిమల్లె సెంటుడుపులు న్తాంబూల ముద్రల్, గళం
బున వ్రేలాడు సువర్ణహారమది బాబూ యేది నీ కామరూ
ప నిశాభోగము లెవ్వరింట ననుచు న్భర్త న్వితర్కించు బో
దిన పూర్వంబున వచ్చు భర్త గని బాధించం గతచ్ఛిహ్నాముల్.

**6. కలహాంతరిత**

ఉ. పండుగ చీర లేదు సహపంక్తి భుజింపగ తోడివారితో
పెండిలియందు నొక్కనగ పేరును లేదని భర్తపైన తా
చండిక వోలె దూకగ, విచక్షణ లేని గయాళి భార్యతో
నుండగలేక భర్త జనె, నుప్పెన తగ్గి కలంగె భామరో.

**7. ప్రోషితభర్తృక**

తే.గీ. నదులు సంద్రాలు గడిచి నా నాథుడరిగె
కలిమి సాధించ, చిత్తమ్ము కలవరించె
విషపురోగమ్ము లచట నెవ్విధి భరించు
నని మగని గూర్చి దుఃఖించె యతివ యోర్తు.

**8. అభిసారిక**

మ.కో. చీర గట్టెను పూలు బెట్టెను సిగ్గులన్నియు కంటిలో
నారబెట్టెను గుర్తుగల్గు వనమ్ము జేరగ బాటలో
జోరువానలు చెర్వు కాల్వలు చుట్టుముట్టగ ప్రేమకై
ధీర, గౌరిని గొల్చి సాగెను తీరె కష్టము లామెకున్.

# డా. వరలక్ష్మి హరవే

**1. స్వాధీనపతిక**

ఉ. అందము జూచియే వలచి యందగ గోరిన దామెయే తనన్
డెందము దాచెనే వనిత యెందులకామెను జూడఁగా మదిన్
చందనశీతలంబుగద చంద్రుని వెన్నెల బెంచె మోహమున్
తొందరజేసెనే వలపు తొయ్యలి రూపుకు దాసుడంచు వా
రందరు గేలిసేసిరిక సుందరి సేవకుడీవటంచునే.

**2. వాసకసజ్జిక**

ఉ. దూరపుకొండలే నునుపు దూరము నేగను జెప్పవైతివే
నేరము గాదులే యిదియు నేనిట వేచుట నిల్చిజూచుటన్
మారదు కాలమే మదిని మారని యాతని రూపమెల్లెడన్
కోరగలేదులే విరహకోమలి వేదన బెంచు బూవులన్
చేరర జాగుసేయకను చేడియ కౌగిలి వేచె నీకనన్.

**3. విరహోత్కంఠిత**

ఉ. వీలుగ జేరగా మదిని వేళయు పాళయు లేక యీ విధిన్
మేలములాడు రీతియును మేలిమి బంగరు బల్కులేవిరా
పాలన సేయగా మరువ పాలితప్రోషిత నీదు భావమున్
లాలన జేయరా మదిని వ్రయ్యలుగా విరహాగ్ని గాలకే
బేలను వేదనేమరువ బేరపు సారపు బల్కులయ్యెడిన్.

**4. విప్రలబ్ధ**

ఉ. వచ్చెదనంటివే విరుల వాసన వీడక వాడనీయకే
నచ్చిన యందమే గనుల నర్తనమాడెను నిల్వనీక నే
మెచ్చగ వాకిట న్వలపు మేలము గోరుచు వేచియుంటినే





రచ్చను జేయనీకు మరి రాత్రుల రాకను పాడిగాదులే
వెచ్చని కౌగిలి న్మఱిగి వేదన జెందెడు శిక్షలేటికిన్.

**5. ఖండిత**

ఉ. వేచితి రాతిరేదనరు వేడుక యూహల నీదు రాకకై
తోచెను రూపమే ఘడియ దోచదు నిల్వదు మర్వనేల నిన్
కాచిన గన్నులే యలసె గాంచితి వేరొక గాంత కౌగిలిన్
ఆచియు దూచియే బలుకఁ యాదరముండును మోసబోకనీ
దాచిన బ్రేమయే వలదు దాగని మోసపుదొంగ వీవనన్.

**6. కలహాంతరిత**

ఉ. వచ్చితివేలనో మరచి వంచన జేసియు మోము జూపగన్
మెచ్చితినంచునే బలుక మేలగు రోజులు బోయెలే యికన్
నచ్చిన జోటికే యఱుగు నాకదియేలను జెప్పబోవగన్
పచ్చిగ జెప్పబోనికను పాలును నీరును దేటదెల్లమున్
వచ్చిన జాలులే యనెడి వంటరిజీవిత గమ్యమేమిటో?

**7. ప్రోషితభర్తృక లేదా ప్రోషితపతిక**

ఉ. దూరపుదేశ మేగితివి దుఃఖము గల్గెను నిన్ను గానకన్
గారపు జేతలే మదిని గాయము జేసియు మర్వనీయవే
ఊరడి జేతురే మనల యూసుల గాథలనెన్నియో సఖుల్
కారణమేమియో దిగులు గానక వేగము రావదేలనో
భారము దోచెనే వలపుభాగ్యము జాలును వేగరమ్మికన్.

**8. అభిసారిక**

ఉ. ప్రేమయె పొంగగా విరహబ్రేయసి సాగెను స్పర్శ గోరుచున్
కామము హెచ్చెనందురుగ గారణమేమని జూడరెవ్వరున్
ఆమని వేళల న్చెలుని యాదరమొప్పగ కౌగిలే బిగిన్
మా మది తొందరించగను మానను పన్నగకేకిలే గనన్
ప్రేమయు గోరుచు న్జనెద ప్రేముడి సారికనైద నన్గనన్.

# డా. మహ్మద్ షరీఫ్

**1. స్వాధీనపతిక**

సీ. అందచందాలచే నాప్యాయతలచేత
    సుగుణాల నొలికించి సొగసు జూపి
మేనియొంపులు పేర్చి మానిని భర్తను
    కొంగున గట్టియు కులుకుచుండు
భర్త స్వాధీనుడై భరియించు కష్టాలు
    సతి సేవలో తాను వెతలు బొంది
యువిద పాదాలను నుత్సంగమున బెట్టి
    పారాణి దిద్దును గారవమున
ఆ.వె. సుందరాంగి బాహుబంధమ్ములో మ్రగ్గి
నుదుట తిలకమిడును నొప్పునటుల
తరిగిపోవు కీర్తి తరుణియే లోకమ్ము
మోహవాంఛయందు మునుగుచుండు!

**2. వాసకసజ్జిక**

సీ. నీ రాక కొరకునై నే వేయికన్నుల
    నెదురు చూచుచునుంటి నిదుర రాక
విరహతాపమ్ముచే విరిపాన్పున శయింప
    రాలిపోయెను పూలు జాలిలేక
పగలు రాత్రి యనక సిగలోని పూవులు
    సొగసు లీనుట మాని సొమ్మసిల్లె
దరిజేర రావేల విరహాగ్ని భరియింప
    కలలోన నీ రూపు కానరాగ





తే.గీ. కనుల వత్తులు వేసి యీ గడప నిలిచి
దారి బోయెడి వారిని తేరి చూడ
రార నను జేర జాగేల, విరహబాధ
తీర్చి కాపాడు ప్రాణాలు దీనురాల!

**3. విరహోత్కంఠిత**

సీ. పలుమారు చన్నీట జలకమ్ములాడిన
    తగ్గదాయెను వేడి తనువునందు
పగలు రాత్రయినను పలుచటి వస్త్రాలు
    ధరియించినను వేడి తగ్గదాయె
నిరతమ్ము వెంద్రుకల్ నీటిలోనుంచిన
    వేడి తగ్గుటలేదు చూడగాను
కానుగ నీడలో గడపితి దినమంత
    తనువు చల్లబడదు తరచి చూడ
తే.గీ. ధనపు సంపాదనయె నీకు తప్పదయిన
విరహబాధ నే తాళను వేగ రార
కామవాంఛను దీర్చియు కావుమోయి
వేడి తగ్గించి నన్నేల వేడుచుంటి!

**4. విప్రలబ్ధ**

సీ. పలుమారు ప్రేమతో కలసిన చోటికి
    రావేలనో సఖా రమ్యముగను
నిను జూడ మనసాయె తనువంత పులకించె
    మలిసంధ్య దాటెను నెలవు రార
యుచ్ఛ్వాస వేడెక్కె నిశ్వాస బరువాయె
    నధరమ్ము సుధలూరి యెదురుచూచె
తనువంత తిమిరెక్కె కనులలో కైపెక్కె
    తుళ్ళింతలాయె నా యుల్లమందు

తే.గీ. నగలు బరువాయె మేనికి నమ్ముమోయి
వేడిగాలికి సొగసంత వాడిపోయె
ముఖము కళదప్పి కందెను సుఖము కొరకు
రార నను జేర రావేల రమణమీర!

**5. ఖండిత**

సీ. మనసిచ్చి తనువిచ్చి మాధుర్యమును పంచి
సౌందర్య లోకాల విందు జేసి
స్వామివే నీవని స్వర్గసుఖములిచ్చి
యెడబాటు రాకుండ నడుచుకుంటి
సరసాల దేలించి సరదాలు పూయించి
చిరునవ్వుతో నిన్ను చేరుచుంటి
నిన్ని జేసిన నన్నె యేటిలోనను ముంచి
పరభామతో గూడ భావ్యమగునె?
తే.గీ. చాలు చాలింక నీ ప్రేమ సరసమింక!
తాళ లేనింక నీ బాధ! దరికి రాకు!
మానవాధమా నన్నింక మరువుమనుచు
కోపగించుచు ఖండిత శాపమిచ్చె!

**6. కలహాంతరిత**

సీ. కలహాగ్ని మనసును కాల్చివేయుచునుండ
నవమాన మొంది నే నరిగిపోతి
విరహమ్ము తాళక నిరతమ్ము నీ ధ్యాస
కలత నిదురయందు కలలు రాక
అలనాటి కలలన్ని తలపోసి నిట్టూర్చ
కన్నీటి ధారగా కారిపోయె
పలుమారు కలహించ నిలువెల్ల గాయమై
క్రోధమ్ముచే ప్రేమ కూలిపోయె





తే.గీ. చంచలత్వమే ప్రేమకు జ్వాలలేర్చె
నిన్ను విడిచియు బ్రతుకను సన్నుతించు
మోహనాంగిని మన్నించు! మూర్ఖయెయగు
చెలిని కలహాంతరిత నేను చిలుకు ప్రేమ!

**7. ప్రోషితభర్తృక**

సీ. పరదేశ మేగినన్ నిరతమ్ము నీ ధ్యాస
చిరునవ్వు మోమును మరువలేను
విరహాగ్ని గాల్చెను కరమూని మ్రొక్కెద
రావేల నీ ప్రేమ రమణి జేర
వర్షకాలము బోయె వణకించు చలిపోయె
నెండకాలము వేడి మండుచుండె
పంటకోతలు దీసి పండుగలు పబ్బాలు
జరుపుకున్నాము నీ జాడ లేదు
తే.గీ. చింతలన్నియు దీర్చగ చేరరార
పంతమేలర నీ ముద్దు కాంత నేను
మనసు నెరిగిన కాంతపై మమత జూపు
ప్రోషితపతిక నేలుము పుణ్యచరిత!

**8. అభిసారిక**

సీ. నీ ధ్యాస పులకింత నీ శ్వాస తుళ్ళింత
నిన్ను జేరుకొనెద సన్నుతాంగ
తనువంత గిలిగింత మనసంత తలపింత
వలపుల గంధమ్ము చిలికెదనుర
నీవు నా దైవము నీవు నా స్వర్గము
కరుణించ లేకున్న నరకమౌను
సరిలేరు నాకెందు సౌందర్యరాశిని
కలుసుకో నచ్చోట కలతదీర్చ

తే.గీ. నెన్ని యద్దంకు లెదురైన నిను గలిసెద
వన్నెకాడవు నీవు నా వలపుఱేడ
సన్నుతాంగిని నేలుకో సమయ మిదియె
వన్నె యభిసారికను నేను వదల నిన్ను!

**(మొబైల్: 9866560527)**





## డా. పాండాల మహేశ్వర్

**1. స్వాధీనపతిక**

తే.గీ. అతివ గారాల వన్నెల భర్త నెపుడు
చెప్పుచేతల నుంచుచు చెలిమిచేత
పెక్కులిక్కటు లొనగూర్చు ప్రీతితోడ
సుగుణసుందర సుకుమారి శోభితాక్షి!

**2. వాసకసజ్జిక**

తే.గీ. దూరయానంబె జేయంగ భారమనుచు
వెగటు జెందక వయ్యారి యెదురుజూచు
రంగుహంగులా శృంగారభంగిమలను
ప్రియుని రాకయే భాగ్యమై వేదనగను!

**3. విరహోత్కంఠిత**

తే.గీ. ప్రియుడు పనివల్ల రాదని ప్రీతిబడయ
విరహబాధాగ్ని గుండెల పరితపింప
బాధపడె కన్నె విరహాగ్ని భారమతిగ
పేలవము గుండెనా యిక బేలయనగ!

**4. విప్రలబ్ధ**

తే.గీ. ప్రియుని బాసల మదినెంచి పిలుపు కోరి
వ్యాకులత చెందెనా యిక వాంఛలేమి
నమ్మి రానట్టి ప్రియునికై సొమ్ములన్ని
కోపతాపాన విసిరేయు కోమలాంగి!

**5. ఖండిత**

తే.గీ. ప్రియుని నమ్మియు మోసాన పేర్మిలేమి
అన్యకాంతతో గడిపినాడనుచు తెలిసి
మరుని మరునాడు కోపాగ్ని మాటదుల్పి
తిరుగబడునట్టి ఖండిత తీరు తీపి!

**6. కలహాంతరిత**

తే.గీ. కోపతాపంబు మితిమీరి పాప వలెను
బాధపడునట్టి చందమే కలహమెంచు
విడిచి తానేగు భయభక్తి విలసనమున
కావ్యకలహాంతరిత గాదె కలువకంటి!

**7. ప్రోషితభర్తృక**

తే.గీ. భర్త దూరమై తలచుచు బాధపడుచు
ఎప్పుడేతెంచు టెరుగని చొప్పుగనక
సాటిస్త్రీలతో సంతోష శాంతమెంచు
కాంత ప్రోషితనాయిక కంబుకంఠి!

**8. అభిసారిక**

తే.గీ. సంగమార్థమై స్వేచ్ఛగా సాగు లలన
నియమములనెల్ల వదిలియు నీవెయంచు
ప్రియుని జేరెడు అభిసారి కాత్మబలము
అష్టకష్టాలకెదురీదు నిష్టముగను!

**(మొబైల్: 9912180054)**





# డా. జి. సీతాదేవి

**1. స్వాధీనపతిక**

ఉ. వన్నెల చిన్నెలన్ దనదు భర్తను కొంగున గట్టుకున్నదై
అన్నులమిన్నయై సతము హాసము జిల్కెడు మాటలాడుచున్
కన్నుల సైగలన్ ప్రియుని కాంక్షల దీర్చుచు నిత్యభోగియై
పున్నెము మీరగా నతని బొందితి నంచును లొంగదీయునే!

**2. వాసకసజ్జిక**

ఉ. వచ్చును నాథుడిచ్చటకు వానికి ప్రీతిని గూర్తునంచు దా
హెచ్చగు ప్రేమమున్ విరుల హేలగ శయ్య నలంకరించి తా
నచ్చపు వేడుకన్ దగిన యాభరణమ్ముల మేన దాల్చుచున్
గ్రుచ్చిన పూలమాలికల కుచ్చులవేనలి గూర్చి యొప్పునే.

**3. విరహోత్కంఠిత**

ఉ. వత్తును వేళమించకయె వాకిట నిల్చెదనన్న నాథుడే
చిత్తజు బారినం బడగ జేయుచు చేరగ రాకపోయినన్
మెత్తని పూలపానుపు, సమీరము వెన్నెల కాకరేపగా
సత్తువ గోలుపోయి తన శ్వాసయె భారముగాగ వేగుచున్
మిత్తియె మేలుమేలనుచు మేదినిపై బడి సొమ్మసిల్లునే!

**4. విప్రలబ్ధ**

ఉ. కాంతుని రాకకై కనులు కాయలు గాయగ వేచిచూచి తా
నెంతకు రాకపోయిన ననేక విధమ్ముల నూహ జేయుచున్
శాంతము గోలుపోవుచు విచారము క్రోధము పెచ్చరిల్లగా
చెంతను చేతికందిన విశేషవిభూషణముల్దొలంగనా
శాంతము జేయుచున్ చెలగు హస్తిని వోలె విజృంభణమ్మునన్.

**5. ఖండిత**

ఉ. నమ్మిన నాథుడే దనకు నచ్చనిరీతిని రాత్రియంతయున్
నెమ్మిని వేరు భామకడ నిద్దురజేయుచు వచ్చినంతనే
క్రమ్మిన మత్సరంబునను గాఢపు రోషకషాయితాక్షియై
పొమ్మను వానినిన్ వెలికి ముప్పిరిగొన్న నిరాశ గల్గగన్.

**6. కలహాంతరిత**

ఉ. తోడువు నీడవంచు కడుతోషము గూర్చుచు గుట్టుమట్టుగా
వేడుక నన్యభామ గొని వేకువజామున నిల్లు జేరగా
చేడియ ఛీత్కరించుచును చెల్లెను నీకును నాకు నేటితో
వాడటు పోయినంత తడబాటును తాపము నాపలేకయే
వాడిన పూవువోలె తన పాన్పున దూలును శోకతప్తయై.

**7. ప్రోషితభర్తృక**

ఉ. భారము నెంచకే బ్రతుకు భారము మోయగనేగె నక్కటా
దూరపుసీమకు న్మగడు, తోచదు కాలమతండు లేకయే
మారుని పోరదంచగనుమానుగ చెంతకు చేరరాడయో
వేరొక మార్గమేదియని వేదననాపగ లేక చింతిలున్.

**8. అభిసారిక**

ఉ. ఈడగువానిగా దలచి యీప్సితసిద్ధికి మోహతీవ్రతన్
గూడును వీడుచు న్మిగుల గుప్తముగా నడురేయి యందునన్
వాడలవాడల న్దిరుగువానిని గూడగ వ్యాకులంబునన్
గాఢపుప్రేమము న్తరుణి గాంచదు జారెడు నంబరంబునన్.

**(మొబైల్: 9849332496)**





# గాదిరాజు మధుసూదన రాజు

**1. స్వాధీనభర్తృక**

మ. పతినే దైవమటంచు నెంచి వ్రతమున్ భక్తి న్ఘటించు న్పతి
వ్రత గెల్వంగ వశీకృతంబగు సతీ స్వాధీనుడౌ భర్తయున్
స్తుతిజేతు న్భవదీయ కౌశలము విధ్యుక్తంబులౌ నీ హొయల్
ద్యుతి సౌందర్య విలాసముల్కళలు సత్యోత్కృష్ట సౌభాగ్యముల్.

**2. వాసకసజ్జిక**

మ. పడక న్పద్మదళమ్ములన్ బరచి పుష్పంబుంచి ద్వారంబులన్
పడకింట న్రమణీలలామ కదిలె న్ప్రాణేశు నిన్దల్చి వా
ల్జడకు న్పూవుల గూర్చి వేచె హృదయోల్లాసంబుల న్గూర్చగా
వడిచేర న్జనుదెంచు ప్రేమికునికై స్వాలంకృత స్త్రీత్వమై.

**3. విరహోత్కంఠిక**

మ. క్షణము ల్దీర్ఘములై గతింపగను కక్షంబూనెనేమోయనన్
గణుతింప న్వ్యథలుండు కోటి విరహోత్కంఠీ మనోగీతికన్
తృణమే తానన విస్మరించుట నసంతృప్తి న్వ్యథాతప్తతన్
వణకంగ న్మృదులాధర ద్వయము తాన్వాపోవు చాంచల్యయై!

**4. విప్రలబ్ధ**

మ. కినుకన్జెందెను రాత్రి వేచి యటు సంకేతస్థలి న్వీడెఁ గా
మిని వంచించె విటుండి సీ! రతిసుఖమ్మీయంగ నమ్మించి యం
చును సర్వాభరణమ్ముల న్విసరుచు న్శోకంబునన్మున్గుచున్
కనిపించెన్ క్షతనాగమట్లు శయనాగారంబుఁ దాన్జేరుచున్.

5. ఖండిత

మ. స్తననీవీజఘ నోరుసంపదల సౌందర్యంబుల న్మిన్నయౌ
తన మాటెట్లు ప్రియుండు మీరెనని నిద్రన్మాని యోచించుచున్
కనుల న్రక్తపు చారికల్మెరయ రక్తావృత్తరమ్యాస్యయై
కననన్యాంగన సౌఖ్యలీనుడగుట న్ఖండించి క్రుంగెన్మదిన్.

**6. కలహాంతరిత**

మ. తలుపుల్దీయక నిందలాడితిని నిర్దాక్షిణ్యభావంబుతో
నను మన్నించునొ లేదొకో విసిగి సన్యాసంబు చేపట్టునో
మనసల్లాడగ మాయమోహినుల కామంబంది శుష్కించునో
యనుచు న్వేదననందు నాయికను డాయ న్మేలు సత్ప్రేమికుల్.

**7. ప్రోషితభర్తృక**

మ. చెలికాడింటికిఁ జేరలేదనుచు వచ్చె న్చైత్రమంచు న్గనన్
తలుపుల్దీయుచు దాటుచు న్గడప పాదధ్వాన మూహించుచున్
చెలికత్తె ల్మృదుభాషణం బొసగఁ గించిచ్ఛాంతి కల్పింపగాన్
విలపించు న్హృది విచ్చునో యనగ నుద్వేగంబుఁ దానందుచున్.

**8. అభిసారిక**

మ. కదల న్యాములుఁ దేళ్ళు మార్గమున కుక్కల్నక్కలుం గూసినన్
పొదలు న్దెయ్యములట్లు తోచినను మబ్బుల్క్రమ్మిన న్మ్రోగినన్
మది పొంగ న్ప్రియసంగ మాతురతఁగా మాధీనతత్త్వంబునన్
కదలు న్దానభిసారికై వనిత సాక్షా న్మన్మథార్ధాంగియై.

**(మొబైల్: 9703316760)**





# గంగాభవానీ శాంకరీదేవి మాతా

**1. స్వాధీనపతిక**

ఉ. నీకగు యోగ్యుడే పతిగ నిచ్చె శివాని ఫలించె నోములే
నీ కల నిక్కమై యెదుట నిల్చెను తొల్లిటి పుణ్యమేయనన్
నీ కనుసన్నలో మెలగు నిన్నలరించు విభుండు ప్రాప్తిగా
నీ కనుకూలుడైన పతి నిన్ను వరించె నరాలకుంతలా!

**2. వాసకసజ్జిక**

ఉ. కాలము దీర్ఘమాయె నిదె కాచుకునుంటిని ప్రేమకార్తిగా
పూల నమర్చియుంటిని కపోలము ముద్దిడ వేచియుంటిరా
మేలములాడకే సముఖమే తమినిచ్చు మనోహరా! సఖా!
జాలిని జూపరా యికను జాగును సేయక శీఘ్రమే ప్రియా!

**3. విరహోత్కంఠిత**

ఉ. వీడను నిన్ను నే మరువ ప్రీతిగ వాక్కులనే వచింతువే
వాడెను పూలమాలలు సుభాసపు మోమును గానకేలనో
పాడగ నా మది న్విరహభారపు గానములే ప్రియా! దొరా!
తోడుగ యోచనల్గలిగె దూరపు లోటును దీర్తు వల్లభా!

**4. విప్రలబ్ధ**

ఉ. చేసిన బాసల న్మరచి జేరక రాతిరి నంతయు న్వియో
గా సమసంస్థితి న్మునిగి కాలము గుట్టుగ వెళ్ళదీయగా
బోసిగ మోమున న్నగవు పూయక నేరక వేచియుంటివా
కాసెను నేత్రముల్ బెదరి గాయలు నమ్మగ మోసమొందుచున్.

**5. ఖండిత**

ఉ. వేరొక ప్రేయసి న్వలచి ప్రీతిగ రాతిరి మోదమందగా,
చేరక తానొడిన్వలికి చివ్వున జీవము క్లేశమొంద య
వ్వారము చేయి దాటెనని వాడిన మోమున క్రోధమొందుచున్
భారము నొందగ న్ప్రియునిపైబడె క్రుంగిన మానసంబునన్.

**6. కలహాంతరిత**

ఉ. క్రోధముతోడ వల్లభుని గూడక పిమ్మట శోకమొందుచున్
బాధను నోపజాలనని పాటుగ నీర్వను మ్రగ్గుచున్నదై
నాథుని త్రోసిపుచ్చి లలనామణి సంతపమొందుచుంటిగా
రాధగ రీతి నన్కల హలాల సభావము చింతనామతై.

**7. ప్రోషితభర్తృక**

ఉ. వేదన నొందుచు న్విరహవేదన తాళక నిద్ర వీడి తా
నాదర మానసాన చెలి యందరి వాక్కుల వీనులందునన్
చేదగు భావనంబు విరజిల్లగ దుఃఖితమొందె నాదిగా
సాదరహర్షమౌ పిలుపు సాగక చింతనమొందు పత్నియై.

**8. అభిసారిక**

ఉ. ప్రేమికు నాగమంబునకు ప్రీతిగ వేచిన నాయికామణీ
గోముగ చేరువ న్వలచి గూఢముగా గృహము న్సృజించెరా
తామసమందున న్మునిగి తాపము తీర్చుకొనంగ వేగమే
ప్రేమిక సంగమంబునకు వేళకు చేరె ప్రమోదమందగన్.





## గొల్లమూడి సంధ్య

**1. స్వాధీనపతిక**

సీ. మీదుమిక్కిలి ప్రేమ మధుమతి చూపను
మతిదప్పి జూచును మనసు గెలువ
కొనచూపు వలపుతో కొండెగాడు కలువ
పరవశించును తాను పడచు లేచు
కోరిక చెలరేగ కూర్మితో పలుకుచు
మాటతో చూపుతో మదిని గెలిచి
రంగులద్దిన రమ్య రమణియె తన గోట
మీటుచు పెదవిని మిసిమిమీర

ఆ.వె. సుగుణములకు నెలవు సుకుమారి సుదతి తా
పెదవి పట్టి కొరికి పెనిమిటికిని
మోము చూచి పిలుపు మోహరింపులె గదా
రగులు సెగలునప్పు డగరుపొగలు.

**2. వాసకసజ్జిక**

సీ. సంభ్రమము దాటుచు చల్లంగ చెలికాడు
చేరునను తలపు చెలియ మదిని
అలల వోలె నెగుర నలవోకగా కొంగె
యెదనుండి జారిన దదుపుదప్పి
మగడాడి నాటలు మదిజేరి మెదలంగ
కాముడే యొడలంత కాపుగాయ
తాళలేనిక నేను తనువంత పులకింత
తాపము దీర్చను తరలిరమ్ము



ప్రియుని రాకకై పదే పదే తలచుచు విరహవేదన ననుభవించుచు
ఎదురుచూచు విశాలాక్షి, - విరహోత్కంఠిత.



అష్టవిధ నాయికలు

ఆ.వె. వేగలేను నేను వేగిరముగ రార
కనులు గాయలాయె తనువు పొంగ
చేత నిమురు నీవు చేరిన చాలుగా
చేరిపోదు నిన్ను చెలిమితోను.

**3. విరహోత్కంఠిత**

సీ. పుచ్చపువ్వల తీరు విచ్చిన పున్నమి
ఆరబోసిన యట్టు లందమంత
చెలికాని రాకకై చెలి జూచె చెలిమితో
క్రుంగెను రేరాజు కునికిపాటు
వయసు పొంగులవియె బాగుగ కవ్వించ
కౌగిలి లేనిదే కాపు కాదు
రాడాయె ప్రియుడు తా, రగిలేటి సెగలార్పి
విరహంపు మదిలోన విడిదిసేయ
ఆ.వె. రారకన్న కసిగ రార నీవొకపరి
ముద్దులాడి నన్ను పొత్తుగూడి
చేరు దరికి యెదయు చేపుకొచ్చె
తాళలేను నేను, తాపమార్పు.

**4. విప్రలబ్ధ**

సీ. సింగారి దొరసాని చేరరా చేనుకు
మొక్కపొత్తుల మాటు మొలకవోలె
అన్న యా కబురుకు వెన్నయై కరిగెను
సొగసుల చిన్నారి, సోకుజేసి
చాటుగా పాలతో చప్పుడు లేకను
సాగెను చేనుకా జాజిమొగ్గ
కనరాక సఖుడట కమిలిన మోముతో
కోపించి నిట్టూర్చె కోమలి యట

ఆ.వె. నేలపాలుజేసె నెలఁత దెచ్చిన పాలు
నేల విసరి జిమ్మె పూలచెండు
నేలనబడి పొర్లి కాళ్ళు రెండునపుడు
నేల రాసె, నమ్మనెన్నడనుచు.

**5. ఖండిత**

సీ. మదనతాపముతోడ మదనిక వోలెను
పునుగుజవ్వాదుల పులుముకొనియు
వేయికన్నులతోడ వేచియున్న వనిత
తెల్లవారులు జూచె తెల్లగలువ
స్వచ్ఛతెరుంగక సానిని జేరును
చంద్రుడు క్రుంకగా సదురుజేరఁ
ఖండితనాయిక కంపరమున ననె
కూడదిక మనకు కూర్మియనుచు
ఆ.వె. స్వచ్ఛత గనుమయ్య స్వామి నీవనుచును
సానిదాని సాటి నేను రాన?
మురికిలోన పొర్లమరిగిన పతిదేవ
చాలునయ్య తమరి చాటు నాకు.

**6. కలహాంతరిత**

సీ. పైచేయి తనదిగా పైడిబొమ్మాడను
మొదలు తుది తనదే ముద్దులాడ
కాదన తన కాపు కాలు దువ్వును ముందు
కలికి కోమలి జూడ కఠిన మేను
మాటకు మునుపేను మారము జేయును
ప్రేలాపి ప్రేయసి ప్రేమ లేమి!
పంచేటి మంచము పడకకు పంతము!
కళ్యాణి తానట కలహగృహము!





ఆ.వె. పొద్దు తిరుగు పువ్వు విద్దిక లేదుగ
మడిని వదలిబోయె, మనసు గుబులు
కన్నవారి యింట కనులలో తన యిల్లు
మరులు తనువు నిండ మనసు గుబులు.

**7. ప్రోషితభర్తృక**

సీ. నుదుట తిలకమిడి నదురుదీసియు బంపె
దేశరక్షణకని దేవదేవి
సంతసమున పొంగు సఖుడు తాబొగడంగ
గుబులు మొదలగును గూడుజేర
మింగుపడదు ముద్ద మిత్రుని దలచుక
కంట నిదురరాదు కలికి కెపుడు
రార నా సామి రా, రావోయి చెలికాడ
రాగాల యుయ్యాల రంజుగూగ
ఆ.వె. పంపితపుడు తనను పాపిని గాదుగా?
చూడకున్న మదియు జాడదప్పె
ఎపుడు చూచెద నతడెన్నడు వచ్చునో
గట్టిపట్టు తొడగట్టు జేర.

**8. అభిసారిక**

సీ. అరమరికలు లేని యమరప్రేమిక యామె
కలువ ప్రియుని గోరికల వరమున
సంకేతస్థలముకు సన్నాహపడి తాను
సాపత్యము కొరకు సాగిబోవ
యెన్ని యాటంకము లెన్ని యిక్కటులున్న
కలసిరానిది యాయె కాలమిటుల
తడిసి ముద్దాయెను తపనకేయర చీర
నిలువదాయెను పైట కలికి యెదను

ఆ.వె. గడప దాట చిట్లె కాలిచిటికవ్రేలు
చీరె ముళ్లతీగ చీరలాగ
నెన్ని యిక్కటులను యెదురొడ్డి బోవను
చెంతజేర నతని నంతె చాలు.

**(మొబైల్: 9949219026)**





# గుగ్గిళ్ళ జనార్దనాచారి

**1. స్వాధీనపతిక**

సీ. కన్నెత్తియే కాంత కమనీయ వదనమున్
కాంచగ నొల్లదు కలికి వినవె!
ఏమి నోముల పుణ్యమేమి వరమ్ములో
నీడయై నీ వెంట తోడునుండు!
తలచినంతనె వేగ దర్శనమిచ్చును
తరుణిరో నీ జన్మ ధన్యమమ్మ!
నీ యందచందాల మాయలో బంధియై
మధువాక్కుల న్నీదు మనసు దోచు!
తే.గీ. బుజ్జగించియు లాలించి ముద్దుజేయు!
నీదు కలలన్ని పూర్తిగ న్నిజము జేయు!
శ్రీనివాసుని హృదయమౌ సిరులతల్లి,
అమ్మ పద్మావతీ! భాగ్యమనిన నీదె!

**2. వాసకసజ్జిక**

సీ. సంపెంగ చందన జవ్వాజి గంధముల్
తమకాన తనువున న్జల్లుకొనియు,
మరుమల్లె మందార మరువక పొన్నలన్
పాన్పుపై పరచియు పడతి వేచె!
విరజాజిమాలల న్కురులలో దురిమియు
వెన్నుని రాకకై వేచి చూచె!
మాటిమాటికి వీధి మార్గము న్వీక్షించి
పద్మావతీదేవి పలవరించె!

తే.గీ. వలపు వికసించి హృదయాన పరిమళించి,
కలల కడలిని విహరించె కలికి చిలక!
రెప్పవాల్చక ప్రియునికై ప్రేమమీర,
వేచె వాసకసజ్జికై విభుని కొరకు!

**3. విరహోత్కంఠిత**

సీ. మరువక చంపక మరుమల్లె గంధముల్
తావుల నెగజిమ్మి తగవుబెట్టె!
నవనీత దేహంబు చవిచూడ స్వర్గంబు
నుప్పొంగె సంద్రమై యుబికి యుబికి!
నిర్వేదపు కవోష్ణ నిశ్వాసవాయువుల్
తడుమగా తనుమధ్య తల్లడిల్లె!
కురుల జారవిడిచి మరులమాల ముడిచి,
కుచములుప్పొంగగ కుమిలిపోయె!
తే.గీ. మలయశీతల పవనము ల్మత్తుగొల్ప,
వెండివెన్నెల జాబిల్లి వేదన నిడ,
చిగురుటధరమ్ములు,సెగల చితికిపోవ,
విరహమొందెను రాధిక ప్రియుని కొరకు!

**4. విప్రలబ్ధ**

సీ. నడిరేయి దాటెను నన్నిట్లు రమ్మని
రాకుండుటేమి నా ప్రాణసఖుడు?
ఎంతటి మోసంబు! నెంతగ నమ్మితి!
నన్నిట్లు జేయుట న్యాయమగునె!
నెటివేణి పుష్పము ల్నీరసమొందెను,
విరులేల నాకింక విడుతునిపుడె!
భారంబులయ్యె నాభరణంబులు న్వార
వైచుదు నిప్పుడే వలదు నాకు!





తే.గీ. అలసి వాడెను దేహమే యలమటించి!
భయము జెందెను మనసంత పలవరించి!
ముద్దుమాటలతోడను మోసగించి,
నా దరికిని రాకున్నననయము గాదె!

**5. ఖండిత**

సీ. ఎక్కోమలి యెదపై తృష్ణదీరగ నీవు
పవళించియుంటివో ప్రాణసఖుడ!
కర్పూరచందన కమ్మని తావుల
శోభిల్లె నీ మేను చూడ శుభము!
ఎక్కాంతనుం గూడి శృంగారసీమల
నేలితివో సఖా యెర్రబారె
నీదు నయనములు నిప్పుల భంగియు
నందము ల్వీక్షించి యలసితేమొ!
తే.గీ. వక్షముల నొత్తిగిలి మెడ వాడిపోయె
నేమొ! దించిన నీ శిరంబెత్తవేమి?
రాగరంజిత నీ మేను రమ్యమొలికె,
నాదు మనసున రాగంబు నప్పలేదె?

**6. కలహాంతరిత**

సీ. గద్గదస్వరమున గన్నుల నశ్రుల
ధారలు న్జారగ బోరుమనుచు,
రోదించి, దిగ్గున రోషముప్పొంగగ
గొబ్బున, ముడిచిన కొప్పు విడిచి,
పరుషవాక్కుల తన పతిని దూషణ జేసి,
పో! పో! యనుచు త్రోసె పొలతి వేగ!
అభిమానధనుడైన యా పతిదేవుండు
వెడల, బలికెనిట్లు వెర్రియగుచు

తే.గీ. నాదు వల్లభుండు వెడల నన్ను విడిచి
చూచుచుంటిరి చోద్యంబు చూపు నిలిపి!
మనసెరింగియు మీరిట్లు మౌనమగుట,
ప్రాణసఖులార! మీకును పాడియగునె?

**7. పోషకభర్తృక**

సీ. చనుదెంచు శీఘ్రంబు వినవమ్మ రాధికా!
చింతించుటేలనే చిగురుబోడి!
నీ పేరు జపియించు నిరతంబు ప్రేమగన్,
నీవెంత యిష్టమో నీరజాక్షి!
సరసాల ముచ్చట్ల సాగెడు కాలమ్ము
దప్పక వచ్చులే తరుణి వినవె!
అనురాగమంతయు కనులలో గురిపించి
చిగురుటధరమ్ముల చింతదీర్చు!

తే.గీ. చిలిపిచేష్టల నీ మది సేదదీర్చు!
పూలపన్నీటిజల్లుల ముదము గూర్చు!
కౌగిలింతల హృదయపు కలతదీర్చు!
వినవె! నీ ప్రాణనాథుని ప్రేమకథలు!

**8. అభిసారిక**

సీ. చంద్రబింబము బోలు చక్కని మోముపై
మేలిముసుగు గప్పి, మించుబోడి
మారువేషంబున న్మదనాభిలాషియై
కనుగప్పి యొంటిగ న్గదలిపోయె!
సర్పవృశ్చిక, సింహ జంతు భయము లేక,
ప్రియుని జేరగ వేగ పయనమయ్యె!
వెన్నెల వర్షంబు వేధించ దేహమున్,
సాహసమ్మున తాను – సాగిపోయె!





తే.గీ. నిదురమత్తున దూలెడి వెదురువనము
కలికి మంజీర రవళుల నులికిపడియు
పిల్లగాలుల బీల్చియు ప్రేమరాగ
సుధల, స్వాంతనమొందించె శుభము గలుగ!

**(మొబైల్: 9441179439, 8074171774)**

# గుండా వేంకటసుబ్బ సహదేవుడు

**1. స్వాధీనభర్తృక**

మ. అకలంకమ్మగు నింటినుండి వధువై యందాలు సౌశీల్యముల్
సుకరంబందఁగ జేయవచ్చి నను దాసోహమ్ముగన్జేయ కా
టుక మోమున్గొని బొట్టు దిద్దెదును విద్దూరంపు నా సేవతో
నిక 'నే'నన్నది బాయలోకమున! నిన్నెంతేని స్వాధీనభ
ర్తృకయంచాడరె? సంఘమందుఁ బ్రజవ్యక్తిత్వమ్ము నిందించరే?

**2. వాసకసజ్జిక**

మ. నిరుడీనాడు విదేశమేగి మగడా! నేడు న్విమానంబునన్
విరహం బాపఁగ వచ్చుచుంటివనఁగ న్బ్రేమాతిరేకమ్మునన్
విరిదండల్గఁ బూచెనాయనఁగ నా వేణీవిలాసమ్మునన్
జరవాణిన్గొని నన్ను నీవుఁ గనగ న్సచ్ఛిత్రము న్బంపితే
తరుణీ! వాసకసజ్జికా! యనుచు నన్దాకంగఁ గేల్జాపితే!

**3. విరహోత్కంఠిత**

మ. దరహాసమ్ములుఁ జిందు మోమున ప్రమోదంబంద దర్శించితిన్
చరవాణి న్దమరాకఁ దెల్పెడు సమాచారంపు సందేశమున్
విరిదండ ల్జడఁదాల్చి యత్తరుఁ దగ న్బ్రేమాతిరేకమ్మునన్
మరుకేళి న్మరిపించనుంటి మగడా! మైనిండ మోహమ్ముతో
విరహోత్కంఠితనైతి జాగు తగునే? వేళైన రావేలకో?

**4. విప్రలబ్ధ**

మ. ప్రమదా! రమ్మన వచ్చితి న్నిను పరిష్వంగమ్మున న్దేల్చఁగన్
సమయమ్మైనను రావాకో? యిదియె నీ సంకేతమౌతావెగా?
సుమమాధుర్యఁపు మోవి నే భ్రమరమై ఝుర్రంగ రావేలకో?
నిమిషమ్మైనను తాళలేని సొగసే నిందించ తెల్లారగన్
భ్రమలన్వీడుచు విప్రలబ్ధ వలె పొరన్వైతు భూషల్ప్రియా!

**5. ఖండిత**

మ. మన వైవాహిక వాసరమ్మనుచు సంభావించి రమ్మంటి దీ
వెనలందించఁగఁ, బ్రేమఁ జూపి నిను సంవీక్షించఁగ న్శయ్యపై
కనుగొంటి న్తమ మేనిపైన గురుతుల్కామాక్షితో కూడితే
మనువైనన్బర భామ పొందు తగునే మన్నించనేలేనొకో!
కనఁగా ఖండితవోలె నిన్విడక సంఘమ్మందు సాధింతురా!

**6. కలహాంతరిత**

మ. వలపుల్రేపిన భామవంచు మగువా! వాత్సల్యము న్జూపితే
తెలియన్జాలక నాదు మానసము నుద్వేగమ్మున న్భ్రాంతితో
పలుకన్జూతువె నన్ను వేరొకరితో బంధమ్ము నంటించుచున్
కలహమ్మంతరితమ్ముగన్జెలఁగు వాగ్ధాటి న్విభేదించుచున్
నిలువన్జాలను, పిమ్మట న్మదిని నేనేమో సమీక్షింతువే!

**7. ప్రోషితభర్తృక**

మ. తనకు న్వచ్చుట వీలుకాదనుచు కర్తవ్యమ్ము నే దెల్పగన్
వినలేనంతగ నన్నిసార్లు పతినే వేధించి సాధింతువే
మనసే పంచిన వానిపైన విరహమ్మావేశము న్బెంచునే
వినుమా! నెచ్చెలులైన మేము పలుక న్విజ్ఞానమే పొరగన్
గనగా! ప్రోషితభర్తృకాయనఁగ సింగారమ్ము నీ యందమే! !

**8. అభిసారిక**

మ. తలపున్జేయుచు ప్రేమికా! తమరి పంతమ్మెల్ల నెగ్గించగన్
గిలకొట్ట న్మది వీడి యడ్డముల సంకేతస్థలి న్జేరవా
నలసర్పంబులఁ దేళ్ళఁ గీటకముల న్దప్పించుకొంచు న్వడిన్
దలపోయ న్నియమమ్ములెన్నొ విడఁ! బెద్దల్పైచి మన్నింతురే?
యిలలోనే నభిసారికన్నడువ నీవింకెంత దూరమ్మురా?

(మొబైల్: 94409 03363)

# హంసగీతి

**1. స్వాధీనపతిక**

సీ. ఇతర కాంతలను దానెపుడు గాంక్షింపక
సతియందు ప్రేమతో సఖ్యతగల
పతిగల యీనాటి స్వాధీనపతికరొ
సౌందర్యవతియైన చాన యీమె
మగడిని మురిపించి సెగలను రేపుచు
కనుచూపుతోడను కదలకుండ
శాసించగలిగిన శక్తిగల మగువ
ప్రియుడీమె చేతిలో పిల్లికూన!

తే.గీ. కొంగుబట్టి తిరుగుచున్న కూర్మితోడ
నింటిపనులను జేయించ నిచ్చకమ్ము
లాడు హొయలను జూపుచు నలుసుజేసి
కాలుబట్టి వత్తమనుచు కాలితోడ
దన రమణుని తన్నగలదీ తన్వి కదర!!

**2. వాసకసజ్జిక**

సీ. ఘనమైన స్తనములు గలిగిన కలికిరొ
చెక్కుటద్దపు మోము చెన్నుతోడ
గురుల నొయ్యారము కొప్పున విరులతో
నారతీదేవియె యందమందు
వన్నెచిన్నెల నేటి వాసకసజ్జిక
ప్రియుని రాకకొరకు వేచిజూచు
చరవాణి నొక్కుచు సందేశమును బంపు
సీరియళ్ళను జూచి సేదతీరు!





తే.గీ. పడకగదిలోన బెట్టిన వంటకాల
నన్నియును రుచి జూచుచు నా ప్రియుండు
జాగుసేయ కోపముతోడ నూగిపోయి
ముప్పుదిప్పలు బెట్టునే మూతి ముడిచి !!

**3. విరహోత్కంఠిత**

సీ. ప్రియునికై జూచుచు విరహముతోడను
చెమటలు గ్రక్కుచు చింతతోడ
నిట్టూర్పు విడుచుచు నేటి నాయిక తాను
పాన్పుపై పొరలుచు పొగిలి పొగిలి
తపనపడు విరహోత్కంఠిత గనునెప్డు
పతిఁగూర్చి యోచించు వలపుతోడ
నిష్ఠూరమాడును నెమ్మిక లేదంచు
నతడిని దెప్పుచు నలుగుచుండు!!

తే.గీ. ఇంటిపనులతో నలసిన నింతి యామె
యెదురుచూసి విసుగుతోడ నేసి వేసు
కొనును నుప్పటిల్లగదాను గుర్రుపెట్టి
హాయిగను నిదురించునే నాదమరచి!!

**4. ఖండిత**

సీ. పరకాంతతోడను బతి రాత్రియంతయు
గడిపి వచ్చెననుచు కలతచెందు
శంకపడుచు దాను సరసమ్ములాడక
నే యింతి నిను కౌగిలించెగనగ
గుబ్బల గురులతో గుమ్మెలువోయెనే
నీ యెద తెలుపుము నిన్ను జేరి
యొడిలోన తానెంత యొడబడిచెనొ
నని కోపపడు నేటి యంగయాన!

తే.గీ. వేడుకొన్నను కాంతుడు విగ్రహించు
తాను సహియింపలేకయు దపనపడుచు
కాళికయి వాతబెట్టెడి ఖండితామె
నన్యకాంత మోహమ్మేలనంచు నతడు
కాలు గదపగ తానెప్డు గాపుగాచు!!

**5. విప్రలబ్ధ**

సీ. ప్రీతితో కలియు సంకేతస్థలమునకు
ప్రియుడు రానియెడల విసుగుతోడ
నిస్పృహ చెందుచు నిర్వేదపడుచును
నిందించుచుండును నిర్భయముగ
మరులు గొలుపగను మగని జాడనుబట్టి
యెచ్చోటనుండిన యిచ్చకముగ
ప్రియుని చేరగలదు విప్రలబ్ధగనున్న
నేటి నాయిక తాను నేర్పుతోడ!

తే.గీ. విసిరికొట్టదు నగలనీ విరహిణి తన
చూపులనె విసురుచునుండు జోరుగాను
పతిని కాంచగ ప్రేమతో బరవశించు
విరహతాపముతో బెనవేసుకొనుచు!

**6. కలహాంతరిత**

సీ. చన్నులబట్టగ సరసమేల ననుచు
మోవి తేనెలడగ మొగము ముడుచు
కలహముతోడను కాంతుడు దూరము
కాగ దుఃఖించెడి కలికిరొ తన
విభుని చేష్టలను దెప్పిపొడుచు నెప్పుడు
విరహము చెందుచు ప్రియునికొరకు
కలతపడెడి నేటి కలహాంతరిత తానె
విడక పశ్చాత్తాపబడును బిదప!





తే.గీ. చూపుతోనె ప్రియుని మది చూరగొనుచు
మరల మోహింపజేయును మరులు గొల్పి
మోసగాడని కలహించు రోసముగను
నన్యకాంతఁ జూచినగాని యక్కసుగను!

**7. ప్రోషితభర్తృక**

సీ. దూరదేశముకేగి కూరిమితోడను
మరల తిరిగివచ్చు మగని కొరకు
ననురాగ మోహితంబగు నేటి నాయిక
ప్రోషితపతికరొ పొందుకన్న
నాత్రముతో జూచు నతడు దెచ్చు విలువ
గల కానుకలకయి కలలు గనుచు
సేవలు సేయునీ సింగారి చెలునికి
పోడిమి పొందగ పోరులేక!

తే.గీ. ఇచ్చకములెల్ల జేయుచు నచ్చినటుల
వలపు జూపగ పెనిమిటి పరవశించు
విభుడు బాదాల నొత్తుచు ప్రియము సేయ
సొగసు కానుకలిచ్చుచు వగలుబోవు!!

**8. అభిసారిక**

సీ. వెన్నెల రాతిరి చెన్నుగ మెరయుచు
ముస్తాబయిన చాన ముచ్చటగను
మదనతాపముతోడ మగనికై జూచుచు
నూర్పు విడుచుచుండు నోపలేక
కనుచూపులను కానుకలుగ నిచ్చుచు దాను
విరహముతోడను ప్రియుని జేర
నభిసారిక వలె మోహము చెందుచును నేటి
నాయిక తీరుండునోయి యిటుల!

తే.గీ. ప్రణయభావమ్ము కలిగించు వగలుబోయి
చిర్రుబుర్రు లాడుచునుండు సేవజేయ
మోవి తేనెల మురిపించి మొగము ద్రిప్పు
కొనుచు వదిలి వెడలెనని కోపగించు!





# హరి వేంకటసత్యనారాయణమూర్తి

**1. స్వాధీనపతిక లేదా స్వాధీనభర్తృక**

శా. నా యానంద మహత్ప్రకాశమునకై నా సౌఖ్యసంపత్తికై
స్వీయప్రజ్ఞను శక్తియుక్తుల నిటన్ జెన్నొంద జూపించి నా
ధ్యేయంబుల్ శిరసావహించి యనిశం బిందుండు నాథుండు నా
కాయత్తుండను చుండె తన్వి సరసాహంకార సంరంభియై.

**2. వాసకసజ్జిక**

మ. బహుకాలంబుగ దూరదేశగతుడై భవ్యానురాగాఢ్యుడై
సహవాసస్థితి గూర్చ నాథుడు లసత్సౌఖ్యంబులన్ దేల్చ నీ
యహమం దిచ్చటి కేగుదెంచునని రమ్యాభూషణాన్వీతయై
మహదిచ్ఛాయుతయై పతిన్ దలచు నమ్మాన్యన్ గనంగా నగున్.

**3. విరహోత్కంఠిత**

మ. సఖు డీనాటికి వత్సరంబుక్రిత మాసం జూపి తానేగె నా
ముఖమైనన్ గనరాడు నేటివరకున్ మోదంబునుం గూర్చ డే
సుఖముల్ దక్కును నాకు మారు డిషువుల్ చొప్పించుచున్నాడు న
న్నఖిలంబిందు దహించుచున్న దెపు డిందందున్ ముదం బో చెలీ!

**4. విప్రలబ్ధ**

మ. అవురా! ఎంతటి మోసగాడిత “డిటన్ హర్షంబు నందించి నిన్
జవరాలా! సుఖసాగరంబున దగన్ సత్యమ్ముగా ముంచెదన్
జవముం బూనుచు నేగుదెంతు” నని విశ్వాసమ్ము గల్గించి న
న్నవమానించెను కానరాడు గడిచెన్ హా! రాత్రి తానంతయున్.

**5. ఖండిత**

మ. ఎటులీ వాడుచునుంటివో మృషలిటుల్ హే వంచకాగ్రేసరా!
నిటలాగ్రమ్మున దాని చిహ్నము లటన్ నీ ధౌర్త్యమున్ దెల్పె నీ
విటు లీరీతిని మోసగించగలవా? యీపైని నీతోడ నే
నెటులైనన్ పలుకంగ జూడనిక పో యేలా వృధాలాపముల్?

**6. కలహాంతరిత**

మ. "నను జేరం దగదోయి తప్పుకొనుమా నావద్దకున్ రాకుమా
యనుచున్ దూరితి" నేగె నాథు డెటకో యాత్మాభిమానంబుతో,
ఘనతాపంబున మున్గియుంటిని గదా కామాస్త్రముల్ దాకగన్
మనుమార్గం బిక కానరా దిట చెలీ! మన్నింపు నాకందునా?

**7. ప్రోషితభర్తృక లేదా ప్రోషిత పతిక**

మ. ప్రియు దేగెన్ బహుదూరదేశ మిపు డీ వేళన్ సుఖం బెట్టులో
నయనాంతస్స్థిత కజ్జలావృత జలన్యాసంబు వక్షస్థలిన్
రయమున్ జూపుచు జేరియుండెను గదా! ప్రద్యుమ్ను బాణంబులున్
భయముం గూర్చుచు నుండెనోయి చెలియా! వాడేల రాకుండెనో.

**8. అభిసారిక**

శా. ఆ పూదోటను చేరబోయెద మదీయానంద సంధాత నా
తాపంబున్ దొలగించి నాకు మదనస్థానంపు సామ్రాజ్ఞిగా
ప్రాపున్ జూపెడి నా సఖుం డచటకున్ రానుండె నీవేళనే
చూపం జెల్లును సాహసంబిపు డిటన్ శోభిల్ల నా యత్నముల్.

**(మొబైల్: 9441320381)**





# హట్టి భానుమతి

**1. స్వాధీనపతిక**

మ.కో. వెన్నముద్దలవంటి పల్కులు, వేడుకోలుగ చూపులున్
చిన్నచిన్నగ నవ్వుచుండుచు చిత్తమందలి ప్రేమతో
విన్నవించును మాటలెన్నియొ విర్రవీగదు సుంతయున్
కన్నులందున నెల్లవేళల కాచియుంచును నాథునిన్.

**2. వాసకసజ్జిక**

మ.కో. పూలసజ్జను పోలు భామిని పూర్ణచంద్రుని కాంతిలో
నేలరాడికనీ విభుండని యిచ్చటచ్చట చూచి తా
నోలలాడెను తాపమందున నోర్వజాలక యింతయున్
జాలువారెను మాలలందలి జాజులన్నియు పాన్పుపై.

**3. విరహోత్కంఠిత**

మ.కో. వచ్చుచుండెను సాళ్ళ పిమ్మట వచ్చుచుండెను నాథుడున్
మెచ్చునట్లుగ నుండబోయెద మేటిగా సిగ చుట్టెదన్
విచ్చుచుండెను పువ్వులన్నియు వీచె చల్లని గాలులున్
వచ్చినంతనె వాని కౌగిలి వాలిపోయెద ప్రేమతోన్.

**4. విప్రలబ్ధ**

మ.కో. చెల్లిపోయెను కాలమిట్టుల చెంతచేరడె ప్రీతితోన్
మల్లెపూవులు వాడుచుండెను మంచిగంధమె యారెగా
తల్లడిల్లుచు నుంటినిచ్చట దాటుచున్నది రేయికన్
కల్లమాటలు నమ్మి వచ్చితి కాళరాత్రులె నాకికన్.

**5. ఖండిత**

మ.కో. రేతిరంతయు నెచ్చటుంటివి రేగె కన్నులవేలకో?
మూతిపై నట మీసమందున ముత్యమెట్టుల దాగెనో?
నాతి యెవ్వతె? యెచ్చటున్నది? నన్ను మించిన సుందరా?
పాతరోతయి క్రొత్తవింతకు ప్రాకులాడుచునుంటివా?

**6. కలహాంతరిత**

మ.కో. దూరమాయెను ప్రాణనాథుడు దోషమేమయి యుండునో?
చీర,సారెలు కోరినంతనె చిన్నచూపులు చూచెనా?
పోరు పెట్టుట మానివేసెద పొందుగోరెద ప్రేమతోన్
భారమయ్యెను మానసంబిక భర్త యెన్నడు వచ్చునో?

**7. ప్రోషితభర్తృక**

మ.కో. ఎంత కాలమిదయ్యెనో పతి యెచ్చటుండెనొ యేమిటో?
చెంతలేదని ఖేదమొందుచు చిక్కిపోతి నిటుల్లదా!
యంతుచిక్కని యోచనయ్యెను యచ్చటే విధి యుండెనో?
పంతమేమియొ? కార్యమేమియొ? ప్రాయమీగతి యయ్యెగా!

**8. అభిసారిక**

మ.కో. తెల్లజారుడు కోక కట్టెను తెల్లముత్తెపు హారముల్
మల్లె, సంపెగ కొప్పునందున మాలలై వికసింపగన్
జల్లుజల్లుగ నంగరాగము, జారె నత్తరు మేనిపై
చల్లచల్లని వెన్నెలందున సాగె ప్రేమపిపాసియై.





## డా. జంధ్యాల సుబ్బలక్ష్మి

**1. అభిసారిక**

ఉ. వచ్చితి నీవు రమ్మనిన ప్రాంతము నందిదె వేచియుంటినే
చెచ్చెర రమ్ము నీ యునికిచే మనమందు ప్రశాంతి నిండు నీ
యచ్చరలేమ యందముల నావల ద్రోసెడి సోయగమ్ము నో
సచ్చరితుండ! నీకె, యభిసారికనౌ నను చేర రమ్మికన్.

**2. విప్రలబ్ధ**

ఉ. వేచితి వేచి వేచి యిట వెన్నెల యామిని యావిరాయె నా
నోచిన నోము లిప్పటి కనూనఫలం బిడలేకపోయెనే
కాచెడు కన్నులన్ వెదకి కాయము భారమునయ్యె నన్ను ని
ట్లేచగనేల నేనిటులనే తపియింతును విప్రలబ్ధనై.

**3. ప్రోషితభర్తృక**

చం. అవున! యిదేమి నన్విడచి యా పయిదేశము లేగ నేటికో
వివరముగా నెరుంగుటకు వీలొనరించక మాట మాత్రమున్
చెవినిడలేక యింతటి యచింత్యము చేసితివేల నా మనో
భువనము బాసి పోయితివి ప్రోషితభర్తృకనైతి వల్లభా!

**4. కలహాంతరిత**

ఉ. ఓహొహొ! వచ్చినావె నను నూరక యిట్లు త్యజించిపోవ నీ
యూహల నెట్లు గల్గె నెవరో యిట స్వాగతమీయ లేదికన్
నీ హితులేరు కల్గిరిక నేగుడు మీరిటు వచ్చుటేలనో
ఆహహ! యిప్పుడేల కలహాంతరితన్ నను చేర వత్తురో!

**5. విరహోత్కంఠిత**

మ. అరెరే! యెంతటి తప్పుజేసితిని నాయందేమి మార్పాయెనో
పరదేశంబున కేగినాడు విభుడే వాణిజ్యమున్ చేయనో
దురుసుం బల్కుల నాడి వానియెడ నే దోసంబునే జేసితిన్
విరహోత్కంఠితనైతి ప్రాణవిభుడే వేళైన తా వచ్చునో!

**6. ఖండిత**

ఉ. ఇప్పటికైన వచ్చితివ? యెవ్విధిగా నిను విశ్వసింతు? నీ
చెప్పెడు మాట యొక్కటియు చేసెడు చేత మరొక్కటాయె నే
యొప్పులకుప్ప కౌగిటను నూయలలూగి తరించి వచ్చితో,
డెప్పరికంబ, ఖండితన, టెక్కులమారిన, చాలు పొమ్మికన్.

**7. వాసకసజ్జిక**

చం. తరుణము మంచిదాయె నను ధన్యను జేసితివోయి యింక నే
నరనిముసమ్ము గూడ నిను నావల నుంచను దూరమేల, మం
దిరమిదె, సెజ్జ యిద్దె, యవనీతలమంతయు ప్రేమరాజ్యమే
పరువము కాన్కగా నిడెద వాసకసజ్జికనై మనోహరా!

**8. స్వాధీనభర్తృక**

మ.కో. మానినీ ప్రియనాయకా! మది మందిరమ్ముగ నెంచితిన్
కానవోయి లతాంగి నించుక గారవమ్మున నింకపై
నేను నీవయి నీవు నేనయి నిత్యమిట్టుల నుండ స్వా
ధీనభర్తృకనై తరించెద దివ్యమంజుల విగ్రహా!





# జ్యోతి వలబోజు

ఉ. నోములనన్నిటి న్వనిత నోయగ మేలగు భర్త కెంతయో
సేమము గోరెడి న్మహిళ సేయును పూజలు భక్తిశ్రద్ధతో!
కోమల యందరి న్బిలిచి కూర్మిగ వాయనమివ్వదల్చుచున్
భామల యిళ్ళకు న్జనగ బాధలె గాంచితి విప్పిజెప్పగన్!

**1. స్వాధీనపతిక**

సీ. కాంచగ నలికిడి గానరాదెచ్చట
ద్వారంబు మూయకే దాగిరేమొ!
కలయంగ దిరుగుచు గదులన్ని పరికించ
నచ్చెరువందితి నచటి లీల!
కొమ్మ చరణముల గోరింట నద్దెడి
విభుని గాంచగ నేను విస్తుబోతి!
పనులన్ని జేయుచు పత్నికి వశుడుగ
సాక్షాత్కరించెను 'సత్య' విభుడు

తే.గీ. సర్వకాలములందున సతిని గూడి
కష్టసుఖముల గాంచెడి యిష్టసఖుని
బొందియున్నట్టి గాంతల భోగమరయ
నట్టి 'స్వాధీనపతిక'లే యవని మెండు.

**2. వాసకసజ్జిక**

సీ. మల్లెపువ్వుల తావి మత్తును గొలిపెడి
యింటను నడుగిడ నింపు దోచె!
సాంబ్రాణి లగరొత్తి సౌందర్యమరయంగ
గదులన్ని వెలిగెను ఘనపుకాంతి



ప్రియుడు నమ్మించి సంకేతస్థలమునకు రానందువల్ల రేయంతా అతనికై వ్యాకులపడు విరితీవబోడి - విప్రలబ్ధ.





సంతసమందెడ 'సావిత్రి' మోమున
వేయికాంతుల దీప్తి వెల్లివిరిసె
పతి రాకకొరకని బట్టుచీరను గట్టి
వేచియుంటి ననుచు వివరమిచ్చె
తే.గీ. పతిని మదిలోన దలచుచు పలవరించి
దివ్యపుష్పాభరణముల స్దీప్తులరయ
నెదురుచూపుల నిలిచెడి నెలత గనగ
వెలుగు 'వాసకసజ్జికై' విభుని జెంత.

**3. ఖండిత**

సీ. ప్రాతస్సమయమున పాలసంచులకై
తలుపులు దీయంగ దారుణమ్ము!
పక్కయింటను గల పద్మనాభుని గని
నివ్వెరబోయితి నిజము! నిజము!
ద్వారమ్ము నానియు దయనీయవదనుడై
నిదురించుచుండగ నేను గంటి!
చరవాణి చేనంది 'సమత'ను నడుగంగ
గ్రంధసాంగుని గుట్టు గ్రక్కెనామె!
తే.గీ. భార్యనే మర్చి తిరుగుచు భర్తలుండ
తగిన గుణపాఠమును జెప్పు తరుణులుంద్రు
కఠినరీతిని పోట్లాడ 'ఖండితంద్రు'
బుద్ధి జెప్పకపోయిన బూది మిగులు.

**3. విప్రలబ్ధ**

సీ. ప్రక్కనే యున్నట్టి 'పరిమళ' గేహంబు
తలుపులు దట్టగ న్తాళమాయె
కాపలా గుర్ఖాను కారణమడుగంగ
చెప్పంగలేనని చేతులెత్తె

మార్కెట్టునందున మంచికూడలి యందు
వాహనమందున వనిత గంటి
నెదురుజూపులతోడ నేడుపు మొగమున
విలపించుచుండెను వేదనమున!
తే.గీ. మానసమ్మున దోచెను మహిళ తీరు
ప్రియుడు సంకేతతావుల బిలిచిదాను
మోము జాటును జేయంగ మోసపోయె
దలచు 'విప్రలబ్ధ'లనుచు తత్వమరయ!

**5. విరహోత్కంఠిత**

సీ. మాకు నెదురనుండు 'మాలతీ' భవనమ్ము
గొప్ప శోభలతోడ గోచరించు
నెలలెన్నొ గడచెను నెలతను గాంచక
కారణం బేమిటో గానరాదు
పలుమార్లు బిలువంగ బయటకు వచ్చెను
వాలకమ్మును జూడ జాలి గలిగె
కేశ విముక్తయై క్లేశమ్ము నందుండె
విషయ మెరింగించె విప్పి గుట్టు
తే.గీ. భర్త పరదేశములకేగ పడతిని విడి
దిగులఁ జెందుచు నిలిచెనా దీనవదన
విరహబాధను గుములగ వేదన గని
నిలిచెను 'విరహోత్కంఠితై' నీరజాక్షి.

**6. ప్రోషితభర్తృక**

సీ. వెనకటింటిననున్న 'వేంకటలక్ష్మి'ని
పిలువంగ నేగితి పేర్మిమీర
తైలసంస్కారంబు తగినరీతిన లేని
దుఃఖితమతియైనదుండి గంటి





దేశాంతరమ్మేగి తిరిగి రాలేదన్న
బాధల వేదన భ్రమద గ్రుంగె
గతనెలే వత్తునని గట్టిగ బల్కెనే!
మాటలే మిగిలెను మనిషి రాక!
తే.గీ. పతి విదేశమ్ములకు నేగ భర్త దలచి
మదిని విలపించి కోల్పడె మతిని తుదకు
భోరుభోరున విలపించు బోటినపుడు
బిలుచు 'ప్రోషితభర్తృక' పేరుతోడ.

**7. కలహాంతరిత**

సీ. మాకు దగ్గరనున్న 'మల్లిక' యింటిని
మెల్లిగా దట్టంగ మెలత వచ్చె!
కన్నుల గాటుక కారంగ మోముపై
వెక్కెక్కి నేడ్చుచు వెలది నుడివె
పోట్లాడి పతితోడ పొమ్మని బయటకు
పిమ్మట చింతించ సమ్మతంబ?
వచ్చును నీ పతి వలదిక దుఃఖంబు
ననుచును యోదార్చ నవ్వె నాతి
తే.గీ. తొలుత గలహించి తుదకును దుఃఖమందు
యబల లెందలెందరొ గల రవనియందు
తొగవ తత్వమదేమిటో తోచదెపుడు!
వారె 'కలహాంతరిత'లన నవనియందు.

**8. అభిసారిక**

సీ. చివరింటనున్నట్టి 'చిలకమ్మ' గలవంగ
చెలులతోడను గూడి జేరి బిలువ
వర్షమ్ము మొదలాయె వడగండ్లు బడసాగె
తలుపు దీసిన చేడె తలను నూపి

తానేగవలెనని తరుముచుండిన రీతి
పిలిచిన బలుకక బిరబిరయని
కాలి నడకన దాను కనుమరుగైనచో
నచ్చెరువందుచు నరిగినాము

తే.గీ. అబల ధైర్యము జూడంగ నదిరె మేను
తోడులేకను వానలో తోయజాక్షి
గదల 'నభిసారిక' విధాన గానవచ్చె!
గలరు నేడును మన మధ్య కాలమహిమ!

**(మొబైల్: 80963 10140)**





# కడయింటి కృష్ణమూర్తి

**1. స్వాధీనపతిక**

ఉ. చక్కగఁ గొప్పుదీర్చగను చయ్యన పయ్యెద వల్లెవాటునన్
మక్కువదీరగా మగని మానిని యొక్కతె సత్కరింపుచో
చక్కెర తీపివంటి కడుచక్కని విందులు మోములందగా
తక్కువ యేలనో యతను తక్కుల తార్పుల కంతవారికిన్.

**2. వాసవసజ్జిక**

ఉ. కన్నుల పండుగే గదర కామిని కింపుగ కాముడున్నచో
కన్నుల కాటుకల్గనుడు కామిని మోమున దోసబొట్టునున్
అన్నులమిన్నయై వెలిగె నాపెకు తొందరదేమిటో గనన్
మన్నన జేసినాడటర మాపటివేళకు తాను వచ్చుటల్.

**3. విరహోత్కంఠిత**

ఉ. అన్నులమిన్న భర్త తన యంకము జేరగ జాగుసేయుటల్
గన్నది, వేదన న్దనదు గన్నుల వేఁగుచు, దారి జూచుచున్
కన్నుల కాటుకల్నిలిపి కంకణధారణ కర్ణభూషణాల్
చెన్నుగ దాల్చెనే మగని చెయ్వులు మానసమందు దోచగన్.

**4. విప్రలబ్ధ**

ఉ. ప్రాణము నీవటంచు ననువల్కెను, దానయి లేఖ నంపెగా
మానుగనిక్కడుండుమని, మానెను జేరగ, నింతరాత్రినే
మానిని దక్కెనో తనకు, మానుగ నెవ్వతె యేలుచున్నదో
జాణలు దెల్పుకొండికను జాణకు జాణలె శత్రులౌటలున్.





**5. ఖండిత**

ఉ. ఎక్కడనుండి రాక యిట? కెవ్వతె కేవిధి సేవ జేసితో
చుక్కల రాతిరంతయును, చూడుము నీకయి తెల్లవారులున్
స్రుక్కుచు నుంటిగా యిచట చూచితి నీ ముఖకాంతిరేఖలున్
చక్కగ వెల్గుచోఁ, గపటి, చాలిక నీ దయ, పొమ్ముపొమ్మికన్.

**6. కలహాంతరిత**

ఉ. కారణమేమిటందు? నను ఖాతరు జేయవు రేపుమాపులున్
భారము నాకిట న్మగడ! పాడెద మంగళమింక నీకనిన్
వేరమి బొంది, యంతటనె వేదన నొందుచు నాపె యంతలో
పోరలఁ జిన్నిపాపలను పొక్కుల ద్రోయగలేక నిల్చెనే.

**7. ప్రోషితభర్తృక**

ఉ. కూడును గుడ్చుట ల్నిదుర గూడుట లేమయె వేళలందు నన్,
కూడుట బంధుమిత్రులను కూరిమి పేరిమి మర్చెనెప్పుడో
వేడుక మీరగా నుదయవేళల చక్కగ మజ్జనాదులన్
చేడియ మానెనో! మగడు జేరగ రాక విదేశమేగుచోన్.

**8. అభిసారిక**

ఉ. వచ్చెనొ యాతడక్కడకు? వచ్చియు నాకయి వేఁగ, నింతలో
వచ్చిన యత్తయు న్నిదురపట్టున జేరదె యెంత రాత్రికిన్,
కచ్చియగొట్టునో యతడు కానగరానని వేళపట్టునన్,
వచ్చుచు నుంటినోఁ యనుచు బాఠెను చేడియ వేగిరమ్ముగన్.

**(మొబైల్: 9422846926)**







## కందుల నాగేంద్ర వరప్రసాద్

**1. స్వాధీనభర్తృక** – మధ్యాక్కర

స్వాధీనుడగు పతియె దన సరసన జేరంగ వేగ
స్వాదిమ బల్కుల తోడ స్వస్థత గూర్చుచు నుండు
పాదముపై పతి కరము పదనిస లాడుచు నుండ
మోదము నొందుచు మిగుల మురిపము ముదితయె జూపు!

**2. వాసకసజ్జిక** – మధ్యాక్కర

మధువనమున జేరి విరుల మాలికతోడ సరసపు
మదిరనయన కేళినీరమణి నాథుని మదిని నిల్పి
కదలాడుచు నట కోపమున కలహములాడు తలపుల
కదియించు కోరికను పతి కరములందున జేరు నెపుదు!

**3. విరహోత్కంఠిత**

కం. విరహోత్కంఠిత సరసుని
మరిమరి దలుపంగ మదిని మంటలు రేపన్
విరహాగ్ని గని విరులు వే
గిరబడి శీతలమును వెదకె నమస్సులతో!

**4. విప్రలబ్ధ** – మధ్యాక్కర

శీతకరుండును వెడలె శీఘ్రగతిని చక్కనైన
రాతిరి గడచిపోయె నిడ రాకుండెర సఖుడిచటికి
సాతము గొనిపోయె నిపుడు సరములు భరమైనవి గద
సేతువులాయె జూడనుచు చిటమట బడుచును దీసె!

5. **ఖండిత** – మధ్యాక్కర
పరభామలను గూడి వడిగ వచ్చితిరేల తమరికి
పరిపాటి నన్ను బాధింప పగతుడవికపైన నీవు
పరిహాసమాడంగ వలదు పట్టుదప్పుచు నుండె జూడ
సరగున నిలుపు సరసపు శాంతివచనముల నాథ!

6. **కలహాంతరిత** – మధ్యాక్కర
బలమైన బలుకుల వెనుక బంధము గాంచక నేను
కలహము లాడతి నేడు కలుషమ్ము నిండి మనమున
వలవల యేడ్చిన జలము వరలక యుండెను జూడు
శిలనైతి నిపుడు వలపుల చిగురులు లేక శార్వరిని!

7. **ప్రోషితభర్తృక** – మధ్యాక్కర
సుమధుర భాషణములకు సోలితి గద సొగసుగను
సమయము జిక్కిన వేగ సరసములాడి మనమున
సుమరసమును బంచి విడువ శుభకరమగునే నిరతిగ
దమనుడ దయజూపుము మరి దరిజేరిన తరళేక్షణిని!

8. **అభిసారిక** – మధ్యాక్కర
అంకతలమునందు ప్రియుని యాటల మాటల గురుతు
లింకను బాధింప మదిని యెక్కిలి హెచ్చెను జూడు
కంకి వలె నొరుగ తనువు కలికము సుంతయు లేక
జంకక సంకేతము లిడి జనె వడిగ సరసుని గన!





# కాటేపల్లి లక్ష్మీనరసింహమూర్తి

ప్రియుడు చిత్తమైతే ప్రేయసి మోక్షకాంత

1. **వాసకసజ్జిక**

ఉ. లౌకికవాసనా చయముల న్దగులంబులఁ జిక్కనేల? నీ
రాకకు భక్తి వాహనములన్సమకూర్చితి, భౌతికేంద్రియా
నీకముఁ గూల్చు దివ్యనవనీతములందగ రమ్ము, శాశ్వతా
స్తోకసుఖాంతరాళమున సుందరి వాసకసజ్జిక న్గనన్!

2. **ప్రోషితభర్తృక**

ఉ. రంగుల మోజుతో పరపురంబులనుంటివి, లౌకికార్థివై
స్వాంగన నాత్మవర్తిని విచారమున న్నదద్రోయనేల? స
ర్వాంగములందు చిత్కళల వర్తిలు శాశ్వతమోక్షకాంత రా
పుంగన నెంచవేల? యిటు ప్రోషితభర్తృక వేచియుండెరా!

3. **విరహోత్కంఠిత**

మ. పరమాత్మాంగణఖిన్నతం గనుము, సర్వవ్యాప్త సౌందర్యముల్
తిరమౌ, సౌఖ్యము నందలేక నిట శైథిల్యమ్మునుంబాప, న
శ్వరమార్గంబుల వీడి మోక్షపథసంచారమ్మున న్రమ్మమీ
విరహోత్కంఠిత గావగా మరలుమా విశ్వాత్మ దర్శింపగన్!

4. **విప్రలబ్ధ**

శా. 'అమ్మానాన్నలు, తోడబుట్టిన జనమ్మాత్మీయులౌ స్నేహితుల్
సొమ్ము ల్లోకుల వీడి వత్తు'నని నాలో నాశలన్రేపి దెం
దమ్మంత న్నిను నింపివేచితి నిట న్ధర్మాంగినౌ నన్నిటుల్
రమ్మన్నావని వచ్చితి న్గలియ రారా విప్రలబ్ధన్ననున్!

**5. ఖండిత**

మ. ఇలలో సౌఖ్యములందు జిక్కితివి స్వామీ! రాగబంధమ్ములన్
వలపుం బింకము పొంకముం గలుగు హృద్వ్యాపార శృంగారివై
యెలనాగ న్విడిపోయి బంధితుడవై యెట్లుంటివో? యెక్కడో?
ఖిల సౌఖ్యమ్ములఁ జిక్కి స్రుక్కుదగునే? యేడ్పింతువే ఖండితన్!

**6. కలహాంతరిత**

ఉ. "విందులనారగించితివి, ప్రేమల తగ్గని రోగివైతివే
సందుల దూరి, ధర్మమును జంపెడు ధూర్తుడ! భోగలాలసా!
చందనమేల నీకు? మధుశాలల దూగెడు మత్త!" యంచు నే
నందరిలోన దిట్టు కలహాంతరిత న్గనుమా సుయోగివై!

**7. అభిసారిక**

ఉ. కోరిన నిన్ను చేరుటకు గుట్టుగ చోటును దెల్పినట్టి నీ
కోరికఁ దీర్చవచ్చునను కూళలు దారిని గాచి యాపినన్,
చోరులు జారులు న్వేతలఁ జొప్పడజేసిన దాటినాను, సం
సారభవాబ్ధి దాట నభిసారికనౌ నను జేరు ముక్తికై!

**8. స్వాధీనభర్తృక**

మ.కో. నేను గెల్చితి చెడ్డదారుల నిన్ను దూరగనీయకన్,
కానివారును నైనవారను కట్టుబాట్లను ద్రుంచగా
మేను ధర్మము నిల్ప దానిని మృత్యువంటదు, నేను స్వా
ధీనభర్తృక నందజేతును దివ్యధామ సుఖమ్ములన్!

**(మొబైల్: 9849082669)**





# కొనకళ్ళ ఫణీంద్రరావు

(కావ్యాలంకారసంగ్రహంనుండి)

**1. స్వాధీనపతిక**

సీ. బాపు బొమ్మవనుచు, బంగారుకొండంచు,
పలుకు పతికి తన కులుకు జూపు!
పారాణి నద్దుచు పదములు ముద్దాడు,
పతిని పరవశాన పడతి దేల్చు!
కురులు దువ్వి, నుదుట కుంకుమద్దు పతిని,
పులకరింతల దేల్చ వలపు పంచు!
కొంగుబంగారమై పొంగు విభునకామె,
శృంగారమందించు సొగసు పెంచి!
తే.గీ. అట్టి శృంగారనాయిక లలరు నిపుడు,
వల్లభుడు కైవసమ్మైన వనితలుగను,
వలపు తేనియలందించు పతిని గూడి,
పతి మురిపెముల స్వాధీనపతికలౌచు!

**2. వాసకసజ్జిక**

సీ. ఎదురుతెన్నులు జూచు నింపుగ సఖునికై,
వీధిగడప వీడి వెడలదామె!
పూలపానుపు వేసి పూలు కొప్పున దాల్చి,
పతికేళి యూహల భ్రమయు నామె!
పరిమళద్రవ్యాల పడకగది నమర్చి,
శృంగారముగ నొప్పు చెలియ యామె!
ఘడియలులెక్కించు కాంతుని రాకకై,
రాత్రంతయును వేచు రమణి యామె!

తే.గీ. అట్టినాయిక లెందరో యవనియందు,
సొప్పువేరు కొలువులకు స్వాములరుగ,
నెదురుచూపులు తప్పవు సుదతి కిప్పు
డామె వాసకసజ్జికౌ ననుదినమ్ము!

**3. విరహోత్కంఠిత**

సీ. భర్త ఆఫీసునన్ బందియై పోయినన్,
ఎదురుతెన్నులు జూచు నింతి యిపుడు!
అక్కడ మీటింగు నయ్యవారుండగన్,
తడవతడవ పతిన్ తలచునెపుడు!
పెద్దయుద్యోగాన పెండ్లాము మరియు,
సఖుని యారాటమున్ సఖియ లిపుడు!
కాంతుడు రాకున్న క్షణము లుత్కంఠమ్మె,
భారాన క్షణములు కదలునెపుడు!
తే.గీ. అట్టి సతి విరహోత్కంఠితౌను సతము!
ననుదినము పతికై విరహాన యామె,
వేగిపోవును తన భర్త జాగుజేయ,
నామె యందమైన కనులె యలసిపోవు!

**4. విప్రలబ్ధ**

సీ. ఉద్యానవనమున కూసులకు పిలిచి,
కనని ప్రియునిపైన కినుకబూను!
వెన్నెలరాత్రిలో వేచి, వగచి, యామె,
యతని నిరీక్షణ నలసిపోవు!
సంకేతమిచ్చిన సఖుడు రాక సఖికి,
నిర్వేదమున కంట నిదురరాదు!
ఆలస్యమైనచో నారాటపడు నామె,
నిశ్వాసముల నిండి నిందవేయు!





తే.గీ. అట్టి నాయిక లీకాల మరుదు కాదు,
వట్టిమాటల ప్రియులకై పరుగులిడుచు,
వత్తునని రాని నాయకు మత్తునందు,
విప్రలబ్ధ నాయికలుగ పేరుగాంచు!

**5. ఖండిత**

సీ. అన్యకాంతల పొందె యాతని కలవడ,
నక్కసమున క్రుంగు నామె యెపుడు!
ఆఫీసు టైపిస్టె యాకట్టుకొనెనన్న,
ఆలోచనల దేలి యలసిసొలసు!
రేయి విందుల దేలి రేడు వేకువరాగ,
పెదవి క్షతము గనన్ మదిని వగచు!
కాంతుల క్షమియించు కావ్యనాయికలౌచు,
పతి సన్నిధినెపుడు బ్రతుకదలచు!
తే.గీ. నట్టి నాయిక లీకాల మవనియందు,
నాశ యడియాసలందున నహము వీడి,
భర్త పొందున నుందురు భారముగను,
కాంతలొప్పుదురెప్పుడు ఖండితలుగ!

**6. కలహాంతరిత**

సీ. అధిపుని చేష్టల నల్కబూనునెపుడు,
నంతలోనె యనుశయమ్ము పంచు!
మౌనవ్రతము బూని మగని దూరమ్మంచు,
లాలింపుల కరగి యలక విడుచు!
చపలత్వమున పతిన్ సాధించియున్నను,
పరివర్తనము పొంది పడతి వగచు!
కలహాంతరిత లిట్లు కలత నొందుదు రిలన్,
క్షణికమౌ నల్కల కలుకులగుచు!

తే.గీ. నట్టి నాయికలీకాల మధికమైరి,
పెద్దచదువుల ప్రాభవ ప్రేరణేమొ,
యించుకైనను సహనము నుంచుకొనక,
పతిని కాదంచు చివరకు ప్రణయమొలుకు!

**7. ప్రోషితభర్తృక**

సీ. దీర్ఘకాలము భర్త దేశాంతరమ్మేగ,
నాతని ధ్యానమం దతివ యుండు!
కార్యార్థమై ప్రియకాంతుడు వెళ్ళగన్,
రమణుని తలచి పరాకునుండు!
దుఃఖముప్పెనయౌను తోడు లేక సతికి,
నిర్లిప్తతత్వమున్ నెలత యుండు!
కృశతయౌను పతికై క్లేశమొందుచు సతి,
ప్రోషితపతికయై పొగులుచుండు!
తే.గీ. నచట దూరాన భర్తయు, నిచట తాను,
నవసరమున వేరుగనున్న నతివ యిపుడు,
విరహమున వేగి మదిలోన ప్రేమ నింపి,
యెదురుచూచును సఖునికై యింతి యిపుడు!

8. అభిసారిక

సీ. మదనతప్త యగుచు మదిని వాంఛలెగయ,
ప్రియుని వెదకుచామె వెడలుచుండు!
వెన్నెల రాత్రులన్ విరహవేదనయందు,
తపియించి సఖునికై తరలుచుండు!
చీకటన్న వెరపు లేక ప్రియుని గూడ,
ముళ్లబాటైన తావెడలుచుండు!
నాటంకముల నెల్ల నధిగమించును భామ,
యభిసారికగ సఖు నభిసరించు!





తే.గీ. అట్టి యతివ లిపుడునుండు నభిసరింప,
తమను తాము మరిచిన చిత్తమున వారు,
నాయకుని జేర గోరెదు నాయికలుగ,
నలరు నభిసారికలుగ మోహమున దేలి!

## క్రొవ్విడి వేంకటరాజారావు

**1. స్వాధీనపతిక/స్వాధీనభర్తృక**

ఉ. సౌరగు రూపున నృతి వశం వదుజేసియు సంతసించుచున్
నేరిమితో మనోహరుని నెమ్మది సుస్థితయౌచు నిచ్చలున్
మారుని తీరున న్తనదు మాటను మీరక జేయు నింతి నే
పారు నధీనమౌ పతిని పట్టిన భార్యగ లోకమందునన్.

**2. వాసవసజ్జిక**

ఉ. రూపసియైన నబ్జముఖి రోచిసురత్న సువర్ణ భూషణల్
కోపుగ దాల్చి వల్లభుని కూర్మిని పొందెడు లక్ష్యసిద్ధికై
యోపికతోడ ధామమున నొమ్మికగూడగ వేచి చూచుచున్
వ్యాపకదూరయౌ సతియె వాసవసజ్జిక నాయికాఖ్యయౌ.

**3. విరహోత్కంఠిత**

ఉ. నాథుడు దూరదేశముల నాశ్రయమొందగ పోవగా మదిన్
బాధితయై మనోహరి యపార వియోగ విలక్షణాకృతిన్
వేధను దూరుచు న్విరహవేదన తాళక నశ్రుసారసాం
బోధిని మున్గితేలుచును బోరన నేడ్చెడు నాతి యీమెయే.

**4. విప్రలబ్ధ**

ఉ. కూరిమితోడ కూడెదము కొంచెమునైనను జాగు సేయకో
వారిజలోచనా యనుచు బాళిగ పల్కిన యిష్టుడాయమన్
చేరకయుండుట న్తరుణి చిందఱవోవుచు రేతిరంతయున్
కోరిక మేర నారయుచు కోమలి బేల్పడె విప్రలబ్ధగా!





**5. ఖండిత**

ఉ. నిండగు గారమున్సరదు ప్రేమికుడాయెడ మోజు గూడగా
మెండుగ రాతిరంతయును మీఱుచు వేరొక కాంతతోడ తా
నుండియు వేడ్కగా తిరుగ నుగ్మలి కాగ్రహముప్పతిల్లగన్
ఖండితయౌచు క్రుంగినది కాలమహత్త్వపు కేళిలో నటన్.

**6. కలహాంతరిత**

ఉ. కోపకషాయితాక్షియగు కోమలి మూర్ఖత ప్రాణనాథునిన్
ప్రోపరియైనవాని తన పొత్తును కోరెడువాని ధూర్తయై
దాపట నిల్పగా పరులు తామసము న్నిరసించు బిట్టు సం
తాపము చెందు నాతియె కదా కలహాంతరితాఖ్యయౌదగున్.

**7. ప్రోషితభర్తృక**

ఉ. కాంతుడు దూరదేశమున కార్యభరంబున గల్గు నొత్తిడిన్
సుంతయు పత్నిపై మనసు జూపక నింటికిరాని హేతువై
యింతికి నెంతయు న్దిగులె యేర్పడి యాతనికై తపించుచున్
పొంతయు గోరు భామినిని ప్రోషితభర్తృక యంద్రు ధారుణిన్.

**8. అభిసారిక**

ఉ. ప్రేమకు లొంగి చంద్రముఖి ప్రేయము శ్రేయము నుజ్జగించుచున్
నేమము లేని శీలమున నెమ్మది ప్రేమికుడెన్ను తావుకున్
కామినియై రహస్యముగ గమ్యము జేరునె వారి నెంచకే
ధామము వీడిపోవు వనితన్ అభిసారిక యందురెల్లరున్.

# కుసుమ ఉప్పలపాటి

**1. స్వాధీనపతిక**

సీ. చెంత నీ వుండగా చింతలే యుండవే
యెంత పున్నెమొ నీకు నింతినయితి
యరజేత నుంచి నన్నాయాస బడనీక
మోజులన్నియు దీర్చి మురిసినావె
యరణమేలను, నీవె యాభరణ మనుచు
పాణిగ్రహణము చేపట్టినావె
యాఫీసు పనితోడ నలసి యింటికి రాగ
కాఫితో యెదురగు ఘనుడ వీవె

తే.గీ. తోడు నీడయై క్షణమైన వీడకుండ,
కొండ మీది కోతిని నేను గోర దెచ్చి
వలచు పెనిమిటివయ్య! నా వరము నీవె!
నాకు సాటికలర భువనములయందు!

**2. వాసకసజ్జిక**

సీ. ఆషాఢము గడిచె నతి దుర్భరముగాను
నీ రాకకై వేచి నిలచినాను
సడియైన నీ కాలి సవ్వడే యనుకొని
విరహతాపాల నే వేగినాను
మల్లెలు, జాజులు, మరువంపు మాలలు
ప్రక్కపై పరచితి చక్కగాను
ప్రేమగా నిచ్చిన పెళ్ళిచీరను తీసి
మనసార కట్టితి మరులు రేప





తే.గీ. సరస శృంగారముల రతీసతిని నగుచు
మోహములు రేపి తీర్చెద మోజులెల్ల
పగలెరుగని రేయిని తేలి పరవశింప
నంతులేని యానందాల ముంచెదేను.

**3. విరహోత్కంఠిత**

సీ. చిన్నమాట కలిగి చెలిని వీడితివేల?
కోపమే ముంచె నా కొంప నిపుడు
నీవు లేని రేయి నే తాళగా లేను
దరిచేరి యొకసారి దయను జూపు
తలలోని మల్లెలు తాపాలు రేపగా
వెన్నెల పగబూని వేడి పెంచె
నొంటరి పడక నీ తుంటరి పనులను
గుర్తుచేసెను మది గుబులు రేగ

తే.గీ. ఆకలియు దాహమను మాట యసలు లేదు
సఖులతో నెట్టు చాటింగు సాగలేదు
ధ్యాస శ్వాసయై వేచితి తాళజాల
తెల్లవారుటెట్లో రేయి తెలియకుండె.

**4. విప్రలబ్ధ**

సీ. మాల్కు పోదమనుచు మాయమాటల జెప్పి
మాట యిచ్చె సఖుడు నీటిమూట
యొంటిగ నను జూచి తుంటరులు హసించ
నవమానమున మది యడలె నకట
యెంతకు రాడాయె, నేయూసు లేదాయె
చింతతో నా మది వంతగొనెను
ఎందుకీ సింగార మెందుకీ సోయగ
మెవరి మెప్పులకు నీ నెదురు జూతు?
(నే నెదురుజూతు ఉండాలేమో)

తే.గీ. కల్లబొల్లి మాటలతోడ కథలు జెప్పి
కానుకగ నిచ్చె కన్నీరు కరుణమాలి
యేది గతి నాకు, జీవించుటెటుల నేను?
విధియె వంచించె బ్రతుకయె వెతలపాలు.

**5. ఖండిత**

సీ. ఎటనుండి నీ రాక? యెవరింట నున్నావు?
రాతిరి రాని కారణము తెలుపు
షర్టుకంటెను రంగు సవతెవరో చెప్పు
రంకు తెలిసెనిక బొంకలేవు
నీ తోడ జీవించి నేనింక మనజాల
నా దోవ నేనుండ నాకు మేలు
ఎంగిలి కూటిని నెటుల ముట్టుదు, రద్దు
మన బంధ, మొంటిగ మనుదునింక

తే.గీ. చపలచిత్తులు పురుషులు జారు లౌర
నమ్మి చిక్కుల బడెదరు నాతులెపుడు
స్త్రీలు నార్థికశక్తిని స్థిరము బొంది
యెదురు నిల్వగ మగవారు బెదరగలరు.

**6. కలహాంతరిత**

సీ. మధిర తాగితివని మండిపడితి నేను
మరలివచ్చితి వీడి మాత దరికి
జననీ, జనకులెంత జాలి జూపినగాని
నీవు లేక యుగమై నే గడపితి
క్రోధితనై దూరి కుములుచుంటి నిపుడు
మరచితి నీ ప్రేమ మందమతిని
మన్నించి యొకసారి నన్ను చేకొను సఖా!
కౌగిళ్ళ కరగించు కరుణతోడ!





తే.గీ. పతిని నెడబాసి నరకము బడయలేను
చపలచిత్తనై జేసితి చాల తప్పు
తప్పులున్న లాలనతోడ చెప్పుకుందు
నౌకరి కొకరమై వీడక యుందు మెపుడు.

**7. ప్రోషిత భర్తృక**

సీ. అమెరికా ప్రాజెక్టు అరుదైన యవకాశ
మని వీడిపోతివి యతివ నిటుల
రెండు మాసములాయె రెండు యుగములన
గుండెలో గుబులంత గూడుకట్టె
మరికొన్ని దినములు మనవలెనన విని
యశనిపాతంబయ్యె నడలినాను
దిగులుతో కృశియించె దినదినము తనువు
మానసికవ్యాధి మదిని తొలచె

తే.గీ. కబురులను చెప్పుకొని తీపికలలు కనుచు
గడిపితి మిరువుర మొకటై ఘడియలెన్నొ
తీపిగురుతుల గాయాలు వేపెనిపుడు
విరహవేదన తీరెడు వేళయెపుడొ?

**8. అభిసారిక**

సీ. ఫ్లైటెక్కి మెడ్రాసు పరుగున రమ్మనె,
మనసైన మగవాడు మరులుగొనుచు
నెనలేని సౌఖ్యాల మునుగంగ నొక్కటై
యానందసీమల నందెదమనె
గడపకడనె తండ్రి, గడగడ వణుకాయె
నాన్నకు తెలిసెనా నన్ను జంపు
చేతిలో లేదొక్క చిల్లిగవ్వైనను
బయటపడు టెటులో పాలుపోదు

తే.గీ. పెండ్లి కుదిరె నిష్టసఖికి పిలిచె ప్రేమ
పోయి వచ్చెద నేనని బొంకినాను
దేశమెరుగ, నాభాషేమొ తెలియదాయె
నెటుల ప్రియ నిను జేరి నే నేకమౌదు?





# మాచవోలు శ్రీధరరావు

**1. విరహోత్కంఠిత**

 మ.కో. ఎన్నినాళ్ళని భారమందిన యీ క్షణమ్ముల గాతురా
వెన్నెలల్ విరహమ్ము సోకగ వేడియై నను తాకెరా
సన్నజాజులు, జాజిమల్లెలు సన్నుతించెను నిన్నెరా
విన్నవించెద నాదు కోర్కెల వేగరమ్మిట వల్లభా!

**2. వాసకసజ్జిక**

మ.కో. నీవు మెచ్చెడి కేశబంధము, నీకు నచ్చిన దుద్దులున్,
చేవనందిన మేని ఒంపుల చెన్నుగా సవరించెడిన్
కావి వర్ణపు చీరయున్ గొని కాచియుంటిని, దేనియల్
ద్రావ వాసకసజ్జికైతిని రంగరించుచు గారమున్!

**3. స్వాధీనపతిక**

మ.కో. ఎంచి చూడగ నాలి వాక్కుల నెన్నడైనను మీరగా
నెంచజాలనివాడె నా పతి! హృద్యమౌ చెలువమ్ములన్
కొంచెమైనను వీడకుండగ కొంగు బట్టుకు ప్రేమమున్
బెంచ నాకు నధీనుడై నను బ్రీతిగా గను నెల్లెడల్!

**4. విప్రలబ్ధ**

మ.కో. చాటుమాటుగ నిర్వురున్ దగ సంగమింపగ నెంచ న
చ్చోట గాచితి రాతిరంతయు సొక్కి పోవఁగ నీ యొడల్!
మాట దప్పవటంచు నమ్మిన మానినిన్ విహసింతువే!
వేటు వేయుచు నీ వధూటిని 'విప్రలబ్ధ'ను జేతువా!

**5. ఖండిత**

మ.కో. తీరుగా నిట వచ్చినాడవె తెల్లవాఱగ! దేనితో
చేరియుంటివి రాతిరంతయు? చిత్తమున్ విడనాడి యా
వారకాంతను గూడుటేలనొ? వల్లభుండవటంచు నిన్
గోరి ఖండితనైతి నీ యెద గూర్మి వీడిన నంతటన్!

**6. కలహాంతరిత**

మ.కో. నేరకన్ గలహమ్ము బెంచుచు నింద వేయగ నాథుడే
దూరమయ్యెనె! కోపమందున దూషణమ్ముల జేయుచున్
భారమైతిని ప్రేమ సీమకు! వాక్కు జారక పూర్వమే
మేరువున్ గొని దిట్టకుండిన మేలునొందెడి దాననే!

**7. ప్రోషితభర్తృక**

మ.కో. ప్రోషితుండగు భర్త వౌచును రోదనన్ కలిగించగా
వేషభాషల యూసులన్ విడి వేడుకల్ త్యజియించితిన్
భూషణమ్ముల మాట లెంచక, భోజనాదుల వీడి నీ
భాషణమ్మె దపించుచుంటిని, వచ్చి జేర్చర కౌగిలిన్!

**8. అభిసారిక**

మ.కో. నిన్ను కూడగ నా స్థలిన్ మది నిండుగా తలబోయు నే
నెన్ని విఘ్నములైన గానియు నిమ్ముగా నెదురొడ్డెదన్
కన్నులందున దోచు నాకిక గమ్యమే! యెద లోతులో
నున్న నీ యభిసారికన్ గొని యూరడిల్లుడు ప్రేమికా!





# మల్కూచి రాజేశ్వర శర్మ

**1. స్వాధీనపతిక**

కం. ముందరి కాళ్ళకు వేయును
బంధంబుల కదలనీక భామామణి యే
యందం బధికారంబై
మందంబౌ మతిని జేరి మాయను బెంచున్.

**2. వాసకసజ్జిక**

కం. మల్లియలన్నియు గోసితి
జల్లితిగద పరుపుపైన సరి ధూపముతో
మెల్లగ మలయానిలమే
గిల్లెను తనువంత రారా కితకితలిడగన్.

**3. విరహోత్కంఠిత**

కం. తాపము బొందెను తనువే
నోపగలేనింక నేను నో ప్రియసఖ! నీ
చూపుల బాణము తోచెను
ప్రాపున నీవుండబోక ఫలితము గానన్.

**4. విప్రలబ్ధ**

కం. నగలను నీకై వేసితి
నగణితముగ నీదు రాక నభిలక్షింపన్
నగుబాటున బడవేయగ
పగిలెను గద నాదు గుండె పరమదయాళో!



ప్రియుడు అన్యస్త్రీని బొందిరాగా కృంగి కోపాగ్నిన
తిరగబడు కలకంఠి – ఖండిత





**5. ఖండిత**

కం. గుండెను గుడిగా జేయుచు
నిండుగ నీ రూపముంచి నే నర్చింపన్
మెండుగ స్త్రీలను పొందగ
ఖండంబుగ జేతు మేను కలుషాత్మకుడా!

**6. కలహాంతరిత**

కం. సెలవైనను నను మరవగ
కలహము బడితి స్తగదని, కలతయె పొంగన్
పిలుపున కందక నిలచియె
అల గడపగ నేల రావె హాయిగ నుండన్.

**7. ప్రోషితభర్తృక**

కం. చెప్పిన సమయంబునకే
తప్పకనే దిరిగివచ్చు తత్త్వముగల నిన్
దిప్పలు జేరినవేమో
యిప్పటికిని జాడలేదె యెక్కడ గలవో!

**8. అభిసారిక**

కం. సంగమకాంక్షయె రగిలిన
నంగనపతి సుతుల విడిచి యానందముకై
బంగారపు జీవితమును
భంగము పరచెడి విధమున బయటకు వెడలున్.

## సిరిపురపు నాగమల్లికార్జునశర్మ

**1. స్వాధీనపతిక**

సీ. చక్కనైన మగని ప్రక్కకు పోనీక
 చెప్పుచేతలనుంచి ఒప్పుగాను
వంటిల్లు దుడిపించి వయ్యార మొలికించి
 నగుమోము జూపుచు వగవనీక
దుప్పట్ల నుతికించి తప్పించుకొనలేక
 వెట్టిచాకిరియందు నెట్టివేసి
మోకాళ్ళు బట్టించి మోవితో రుద్దుచు
 పనులెల్ల జేయించు పడతి యగుచు

ఆ.వె. ఆశలెన్నొ జూపి యాలింగనము జేసి
మగని కట్టివేసె మనసుతోడ
హత్తుకొనగ తుదకు చిత్తాయెను మగడు
హద్దు మీరకుండ ముద్దులిచ్చె!

**2. వాసకసజ్జిక**

సీ. పట్టెమంచముపైన పట్టుపరుపు వేసి
 మల్లెపూవులు జల్లి మత్తుగొలుపు
సన్నజాజులు వేసి సంపెంగలను బోసి
 పరదాలు సర్దుచు పాలుబెట్టి
విరహవేదనలతో వియ్యమొందుచు తాను
 కలువపూవుల జూచి బలుకరించి
బంతిపూల జడలు బాగుగా నల్లించి
 మొగలిపువ్వుల గాలి మోహమంద





ఆ.వె. తడవతడవకు జని తలుపు దెరచి మూసి
మరల వచ్చి జూడ మగడు రాక
హృదయవేదనలకు మృదువుగా స్పందించి
పూలదారి వేసె పుడమిపైన!

**3. విరహోత్కంఠిత**

సీ. తబ్బుబ్బిలౌచున్న గుబ్బపై, పైటంచు
 నిముష మోర్వగలేక నిలవననగ
వగలు సెగలు జూపి బాణమ్ములై గ్రుచ్చ
 చాలిచాలని పైట జారి వెడలి
పాలిండ్ల కిరువైపు పరుగులెత్తుట గాంచి
 పరువాల సొగసులు పలువరించ
మేని హొయలు జూచి హాని జేయగనెంచి
 అందాల వంపులే యడ్డగింప

ఆ.వె. నెలత యూరకున్న నెలరాజు బిలువంగ
వయసు మాట వినక వలదటంచు
సఖుని దలచి కొంత సౌఖ్యమ్మునిమ్మనీ
పారవేసె మనసు పరవశాన.

**4. విప్రలబ్ధ**

సీ. పొల్ల యలుకతోడ పెల్లుబుక దుఃఖమ్ము
 కల్లమాట చెవికి మెల్లగాను
చిల్లులేయుచునుండ పిల్లగాలి దగిలి
 గొల్లుమనుచు నేడ్చి తల్లడిల్ల
తెల్లవారునపుడు మల్లెపూవుల ఘోష
 గుల్లజేయ మనసు వల్లగాక
పిల్లశోకమునందు ఘల్లుమనుచు మువ్వ
 లొల్లిజేయచునుండ వల్లగాక

ఆ.వె. సోగకళ్ళ వెనుక మూగమనసు జేర్చి
వెదుకుచున్న రమణి బెదురుతోడ
మగని జాడలేక వగచుచున్న హృదికి
నచ్చుజెప్పలేక ముచ్చటించె!

**5. ఖండిత**

సీ. ఎదురుతెన్నులు జూడ నెదురేగు మగనిని
విరహవేదన జెంది పరవసించి
పలుకరింపగబోయి బయలువెడలినట్టి
మోవిగుర్తులు గాంచి మోహము విడి
విషపు కన్నులదోటి విషయించి వచ్చిన
ప్రియుని నిందించుచు ప్రీతి లేక
హద్దుమీరినవాని హత్తుకొనగలేక
దూరముంచుచు తాను దుఃఖపడుచు

ఆ.వె. మంతనాలు సలుప చెంతజేరగనీక
సఖుని వీడనెంచి సుఖము లేక
కుమిలి కుమిలి యేడ్చు కువలయాక్షి గతాను
మనసు జంపుగొనుచు మరలి చూచె.

**6. కలహాంతరిత**

సీ. కలహాల భామను కౌగిలించక భర్త
వెడపోవుచుండగా వెక్కి యేడ్చి
నిందజేసి బిలువ నిందించి రాకున్న
కచ్చతోడ మనసు వెచ్చబడగ
సుఖసౌఖ్యములు లేని ముఖము జూడననుచు
దుఃఖమొందుచు తాను దుఃఖపడుచు
వదలిపోవు ప్రియుని మదముతో గానక
గెంటివేసి వగచె నొంటిదగుచు





ఆ.వె. పౌరుషమ్ము గలిగి నోరుజారి బలికి
జీవనమ్ము జేయ సిగ్గు విడువ
భర్త లేని తనను బాధించు వచనమ్ము
జనుల నోట వినుచు కనులు దుడిచె!

**7. ప్రోషితభర్తృక**

సీ. ఆలింగనము లేక ఆరళ్లు బడుచున్న
రమణి ముద్దులగుమ్మ రయముగాను
గుమ్మమందు నిలచి కూనిరాగము దీయ
మగని యూసులు మది మలచినపుడు
తొలచుచుండె హృదిని దోబూచులాడగా
తబ్బిబ్బులౌచుండ తాళలేక
ఉద్వేగభరితమై ఊయల లూగుచు
ఊహించుకొనుచున్న యూసులందు

ఆ.వె. కానరాడె మగడు గనుచూపు మేరలో
మొగము నెత్తిజూడ మొగము వాచి
విరహవేదనలను విడవలేకను తాను
దిగులుజెందుచుండె దినము దినము!

**8. అభిసారిక**

సీ. అభిసారికగనౌచు అదురుబెదురులతో
ప్రియుని రమ్మని జెప్పి ప్రేమమీర
గుళ్ళుగోపురములు తుళ్ళుచు దిరుగుచు
కానరాని ప్రియుని గాంచలేక
మనసు గుల్లగనైన మమతానురాగాలు
జంపలేకను తాను జంకుతోడ
సఖుని గలవలేక సౌఖ్యభంగమ్మైన
కుమిలి కుమిలి యేడ్చె కూడు దినక

ఆ.వె. మోహమాయ గలిగి మోహించితి ననుచు
దిగులు చెంది వగచి దిక్కులేక
జుడలేని ప్రియుని వాడవాడల జూచి
సోలిపోయె తుదకు సోకులేక !!

**(మొబైల్: 94411 93087)**





# మంథా భానుమతి

**1. స్వాధీనపతిక**

ఉ. నిర్మలమైన యింతి హృది నెమ్మిక దోచిన ప్రాణనాథుడే
ధార్మికుడౌగనంత కలత నృలిగించక నెన్నడు న్సదా
యోర్మిని బుజ్జగింప పతి యోరగ జూచును ప్రేమ మీరగా
మర్మములేకఁ జేరునుగ మందిరము న్తను మాపటేళకున్.

**2. వాసకసజ్జిక**

ఉ. ఉల్లము ఝల్లనంగ వినవో యమవల్లభు డేగుదెంచగన్
మెల్లగ జాగరూకతను మేలిమి యాభరణమ్ములన్ని ప్రీతితో
నుల్లసము న్ధరించ తనువున్ వెలుగొందుచు మోమున న్విరా
జిల్లెను చెంపల న్గవర సిగ్గులు వాసకసజ్జిక న్నిలన్.

**3. విరహోత్కంఠిత**

ఉ. ఓపగలేక వేచితిని యోరిమితో విరహమ్మునంతనే
కాపడదేమి వింతగద కాంతుడు, రాకనె వేగిరంబుతో
నోపిక మాపుఁజేయకనె నూహల తేలుచు నెల్లవేళలన్
తాపము తాళకుంటిని కదా పునకెన్నడు వచ్చునో గదా!

**4. విప్రలబ్ధ**

ఉ. వేదన నిండగా మనసు, బీరమున న్చెలి కోపగించెగా
గాదిలి మాటనిచ్చి తను కల్లతనమ్మొనరించ నంతయున్
క్రోధము నిండగా విసిరె కూర్చిన యాభరణమ్ములన్నియున్
బాధను కస్సుబుస్సనుచు పానుపుఁ జేరెను విప్రలబ్ధయే.

**5. ఖండిత**

ఉ. కామము కన్నుఁగప్పగను కన్నుల గ్రమ్మిన వాంఛ నిక్కమున్
నేమము లేకయే నెలతనే తనియించితె, రేయి దాటెనో
యేమని వచ్చితీవు గడి, యెందులకో తెలుపంగ రావదే
సామపు మాటలేదిచట శయ్యను చేరకు ఖండితన్కదా!

**6. కలహాంతరిత**

ఉ. కారణమేదియో యతివ గర్వముతోడనె కోపగించగా
చేరిక వద్దటంచు ప్రియు చెంగలి చేరగ నాంక్షపెట్టగా
పోరిక పూర్తిచేయుమని పొక్కడతోడను సామి వీడె కం
జారము, లాభమేమి కలహాంతరి తెంతగ వేడుకున్నచో!

**7. ప్రోషితభర్తృక**

ఉ. దేశములన్నియు న్తిరిగి తేకువఁగల్గిన ప్రాణనాథుడే
లేశమునైన వాసమును లెక్కగొనందుగ గేహమందు ప్రా
ణేశునికై తపించుచును నిత్యము, ప్రోషితభర్తృకే మదిన్
పాశము వేసి లాగి తన బంధము నిల్పగ నిచ్ఛజూపునే.

**8. అభిసారిక**

ఉ. సంగడితోడ నింతి యభిసారికయై వెడలంగ నొంటిగా
చెంగున చేరగ న్చెలుని చేరిక మానసమంత నిండగా
చంగమునౌ ప్రియుండికను, చంద్రుని కాంచిన తారవోలెనే
హంగుగ చెంగలించగ రహస్యపు తావుకు హర్షము న్చనెన్.





# ముద్దు రాజయ్య అవధాని

**1. స్వాధీనపతిక**

మ. తనకుద్వాహము గల్గినంత పతి చెంతన్నిల్చి తా గోరు రీ
తిని కార్యమ్ములు చేయుచు న్మిగుల తృప్తిం జెందు చందాన కొం
గున నాథున్ నిరతమ్ము గట్టుచు చెలంగు న్స్వేచ్ఛరాజిల్లనా
వనిత న్బిల్తురు లక్షణజ్ఞులిలలోస్వాధీననాథాఖ్యతో.

**2. వాసకసజ్జిక**

చం. తన పతి వచ్చునిప్పుడని తద్దయు మేనికి రమ్యభూషలన్
ఘనముగ గూర్చి తాము శయనం బొనరింప ననంగకేళికై
మనమున కింపుగా శయనమందిరము న్గయిసేసి యొప్పు నా
వనితను లక్షణజ్ఞులిలలో వాసకసజ్జిక యంద్రు చూడగన్.

**3. విరహోత్కంఠిత**

మ. స్మరసామ్రాజ్యము నేలగా ప్రియుని తాస్వాంతమ్ము నందల్చి సుం
దరరూపమ్మునునున్న చోటునని చింతాక్రాంతయై యుండునా
సరసుండచ్చటి కేగుదెంచమినినాచా నన్బిల్తురీ భూమిపై
విరహోత్కంఠితయంచు లాక్షణికు లెంతేభావ మొప్పారగన్.

**4. విప్రలబ్ధ**

ఉ. ఇచ్చట నిన్ను గూడెద సతీయని నాయకుడన్న మాటలన్
ముచ్చటగాను నమ్మి పటు భూషణము ల్కయిసేసి మేన తా
నచ్చట చూచి రాడని మనంబున మోసముగా గ్రహించివే,
నిచ్చగ రాయబారము ఘటించెడి నాయిక విప్రలబ్ధయౌ.

**5. ఖండిత**

ఉ. దండిగ ప్రేమగల్గి విదితంబుగ నాథునపైన నాతడిం,
కొండు లతాంగి సంగమము నొందెడి వార్త నెరింగి మత్సరం
బుండ మనంబునం బొగులుచుండెడి లేమను పండితు ల్భువిన్,
ఖండితయంద్రు నాయికల లక్షణము ల్గణియించు తావులన్.

**6. కలహాంతరిత**

చం. తన తలిదండ్రి వంశము లుదారచరిత్రము పెక్కు సంపదల్,
మనమున నెంచి గర్వమున నాథుని చిన్నగ జూచి యాపయిన్
మనమున చేసినట్టి యవమానము దోసముగా నెరింగి యొ
య్యన పరితప్తయైన కలహాంతరితాఖ్య చెలంగు ధారుణిన్.

**7. ప్రోషితభర్తృక**

ఉ. వేషము భర్తకు న్మిగుల ప్రీతి నొనర్పగ దాల్చియందమౌ,
భూషలు దాల్చి సర్వసుఖముల్లననెంచగ కార్యమగ్నుడై,
దేశము వీడిపోవుట మదింగడు వ్యాకులమందు నాయికన్
ప్రోషిభర్తృకాఖ్యగొని భూబుధులెల్లరు పిల్తురెప్పుడున్.

**8. అభిసారిక**

ఉ. నాయకనాయిక ల్తమ మనంబుల నెంచుచు మారకేళి, నెం
తో యనుకూలరీతి కడు తోషముగా నొక చోటు నెంచి తా
మా యెడ నచ్చటం గలియ నాత్మల నెంచెదరట్టి వేళ తా,
నాయిక వేచియుండునట, నా సతి యొప్పభిసారికాఖ్యతో.





# నాగజ్యోతి రమణ సుసర్ల

**1. స్వాధీనపతిక**

కం. దక్కెను వశుడైన విభుడు
మిక్కిలి యనురక్తితోడ మెలగును నాతో
నిక్కము పరసతి గోరడు
మక్కువ స్వాధీనపతిక మహిలో నేనే!

**2. వాసకసజ్జిక**

కం. వచ్చును నా విభుడిప్పుడు
జొచ్చు శయనమందిరమును చొచ్చినవానిన్
ఇచ్చల వాసకసజ్జిక
నిచ్చట మురిపెమ్ముమీర నిష్టము తీర్పన్.

**3. విరహోత్కంఠిత**

కం. సమయము మించెన దేలనొ
రమణుడు రాడాయె నిటకు రంజిల జేయన్
తమి విరహోత్కంఠితనొ
సమయింపడె నా విరహము సరసత తోడన్!

**4. కలహాంతరిత**

కం. సరసకు జేరిన పతికడ
పరకాంతాలింగనమటు పరికించగ నే
దురుసుగ పోదూరితి దా
కరుణన్ బాయగ వగచిన కలహాంతరితన్!

**5. ఖండిత**

కం. సొక్కిన యా కనుపాపలు
మిక్కిలి నఖరేఖలున్న మేనును జూడన్
నిక్కుగ పతి నెత్తిపొడిచి
కక్కిన కూటిని వలదను ఖండితనౌటన్!

**6. ప్రోషితభర్తృక**

కం. పరదేశము కేగిన పతి
మరలడె యింటికి ననుచును మరి మరి దలవన్
విరహమతిశయించిన నను
మురిపించగ నెదురుజూచు ప్రోషితపతికన్!

**7. విప్రలబ్ధ**

కం. వెన్నెల రాతిరి యంతయు
మన్నున గలవగ చెలువుని వంచనజేతన్
కన్నులు గాసిల నేడ్చెదు
చిన్నారిని విప్రలబ్ధ చేడియ నేనున్!

**8. అభిసారిక**

కం. రెక్కలు గట్టుకుఁ వచ్చితి
గ్రక్కున గుఱుతైన చోట కలవగ రావో
నిక్కును జూపకు స్వామీ
అక్కున గొనుమంచు నిలుతు నభిసారికనై!





## నేదునూరి రాజేశ్వరి

**1. స్వాధీనపతిక**

కం. చెదరిన కుంకుమరేఖలు
చదునుగ నధరములతోడ సరిచేయంగా
వదలక ప్రేమను నాపై
ముదముగ పారాణినలది మోదము గూర్చున్.

**2. వాసవసజ్జిక**

కం. సదమల హృదయుడ వనుచును
మదిలో నింపితి సుమములు మల్లెల సౌరుల్
మదనుని రాకకు శయ్యను
కదపక నేనుంటి కనులు కాయలు గాచన్.

**3. విరహోత్కంఠిత**

కం. వెన్నెల వేడిగ తోచెను
సన్నని చిరుగాలి యలిగి సాగెను కసిగా
అన్నులమిన్నకు విరహము
కన్నుల నీరిడి నకరిగి కలవరబెట్టన్.

**4. విప్రలబ్ధ**

కం. మోసము జేసెను రాతిరి
దాసోహమటంచు పలికె దర్పము తోడన్
కాసులపేరులు కనకము
పాశము లెందులకు విభుని వలపు కొరవడన్.

**5.** **ఖండిత**

కం. ఏ యింతి వంత పాడగ
నీ యింటికి వచ్చితీవు నేరుగ జెపుమా
న్యాయముగాదట ప్రియమగు
నాయికనే మోసగింప నరకము దక్కున్.

**6.** **కలహాంతరిత**

కం. పొరబడి కాదని విడచితి
విరహముతో వేగలేక విలవిలలాడన్
మరులూరించగ మదనుడు
పరువముతో నెదను కుదిపి పొలను గ్రోలన్.

**7.** **ప్రోషితభర్తృక**

కం. కలవంచును పనులెన్నో
వలవేయగ ప్రియముగాను వంచన జేయన్
చెలికత్తెల పరిహాసము
కలకంఠికి రగిలెనంట కలహపు మంటల్.

**8.** **అభిసారిక**

కం. రాజు వలెను తాను వెడలి
నాజూకుగ పిలిచెగాన నయవంచనగా
మోజుపడిన ప్రియుని కొఱకు
హాజరు గావలెను కోరి హాహాయనుచున్.





# పంతుల వెంకటేశ్వరరావు (తపస్వి)

**1.** **స్వాధీనభర్తృక**

ఉ. అందముతోడ భర్తలను హద్దుల లోపల పెట్టుచు న్సదా
గంధపువాసన ల్విరియ కాపురమందున భార్యలంత కా
మందుగ నున్నవానిని నమాంతము జేయు విధేయుని న్కడున్
బంధము గోరువారలకు భారము తప్పదటంచు తెల్పుచున్.

**2.** **వాసకసజ్జిక**

ఉ. చక్కని చీరగట్టి విరజాజులు గొప్పున జుట్టి కుంకుమన్
జక్కగబెట్టి భర్త సరసంబులనెల్లను చుట్టుముట్టగన్
వెక్కసమైన కోర్కెలను వేగమె మూటగ గట్టి భర్తకై
అక్కజమౌ విధంబు కమలాక్షియు జూచె చకోరపక్షియై.

**3.** **విరహోత్కంఠిత**

ఉ. అందము వ్యర్థమాయె విరహంబు శరీరమునెల్ల నిండగన్
చందనమెంత రాసినను చంద్రుని జూచిన జాలు భర్తయే
డెందమునందు గన్పడి వడి న్విరహంబును రేపుచుండెనా
బంధమహత్త్వమెన్నగఁ దపస్వులకైనను సాధ్యమేయిలన్?

**4.** **విప్రలబ్ధ**

ఉ. రాతిరియంత జూచినను రమ్యసుధాకర చాంద్రియందు సం
కేతము నిచ్చుచోటునకు గేహము వీడి ప్రియంబున న్సఖుం
డాతడు రాడిదేమియని యంగన కోపముఁ గొట్టె హారముల్
చేతి పసిండిగాజులును చెచ్చెర నేలకు విప్రలబ్ధయై.

**5. ఖండిత**

ఉ. రాగములేని భర్తయు పరాయి పడంతిని సంగమించి వై
భోగములందు దేలుచును మున్గుచు నింటికి రాకయుండినన్
వేగమె కోపగించుకొని భీకరరూపము దాల్చి యాతనిన్
బాగుగ దిట్టుచు న్లలన బాధల నేడ్చుచు వెల్లగక్కుచున్.

**6. కలహాంతరిత**

ఉ. కోపము బూని వల్లభుని కొండొకచో కలహించి శంకతో
కాపురమందు తెచ్చుకొని కష్టముల న్వతి వీడిపోవగన్
శాపము పొందు రీతిగను సారసనేత్రియు నేడ్చుచు న్ధరన్
పాపము చేసితంచు కనుపాపల నీటిని నింపు నిత్యమున్.

**7. ప్రోషితభర్తృక**

ఉ. దేశముకాని దేశమున దేహిగబోయిన భర్త రాకకై
రాశిగ పోసి ప్రేమ ననురాగముతోడను రంగరించి తా
నాశగ జూచుచు న్మగువ యౌనని కాదని పల్కరించ కా
దేశములేమి యీయకను దీనముగా చెలికత్తెలం గనున్.

**8. అభిసారిక**

ఉ. కోమలి కోర్కెతో ప్రియుని గోరిన చోటుకు జేరజూచె నా
కాముని మాయలో బడి స్వకాంక్షను దీర్చుకొనంగ విఘ్నముల్
ప్రేమల నాపలేవనుచు వేగమె దాటుకొనంగ జూచుచున్
సోముని జేరు తారవలె జోరుగ బోయెను సంగమంబుకై.

**(మొబైల్: 99083 44249)**





# పి.వి.ఆర్. గోపీనాథ్

**1. విరహోత్కంఠిత**

ఉ. జాబిలి విస్మరించె తన సాజపు లక్షణ మేమనందుదా
మాబగ జూచుచున్ సుమము లాగుటెరుంగక వాడిపోవునో
జాబిటు వేయవే విభుడ! జాడగనన్ విరహమ్ము బొందు న
న్నీబరి యందురేనియిక, యేలయ జాప్యము వేగ రమ్మురా...!
(ఈబరి – అసమర్థుడు)

**2. వాసవ సజ్జిక**

ఉ. కట్టితి పచ్చకోకయును, గంధము జేరెను హారమొక్కటిన్,
చుట్టితి కేశముల్, మరిక సౌమ్యపు నాగరమిచ్చు హాసముల్,
మెట్టు విరాళమున్నొదవ, మేనికి బూసితి మేలి గంధముల్,
గుట్టుగ రమ్మురా విభుడ కూర్మిని రాజ్యమె యేల బిల్చితిన్...!
(విరాళము – శృంగారము)

**3. స్వాధీన పతిక**

ఉ. నాథుడె నన్ను కాదనడు నాకును సెప్పక సేయడేది శ్రీ
నాథుడనంగ నాతడును నాపయి వ్రాయును కైతలెన్నొ భూ
నాథుడి లెక్కగా నతడె నా మనసేదియు గోర నిచ్చు నే
బాధలు కల్గకుండగను బాళియె జూపుచు బాళి బెంచుగా...!
(బాళి – ప్రేమ, ముదము)

**4. విప్రలబ్ధ**

ఉ. రాతిరి వేచియుంటి గద రంతుకు నీవును రాకపోతివే?!
భ్రాతియ నీవు జూపునది? భ్రాంతిగ నిల్చెను తల్లడిల్లితిన్

నాతిని, నిట్లు సేయుటయె నాయమ నీకిది? విప్రలబ్ధనై
పోతినె ప్రీతుడా తుదకు పోకయె నీకును వంచమాయెనా?!
(పోక – వంచన, వంచము – ముఖ్యము)

**5. ఖండిత**

ఉ. వచ్చితి వింత తొందరగ వారలు దస్తులు కట్టివేస్తిరా?
నెచ్చలి చాలులే యనుచు నీ యెదుటే పలుగాడి మూసెనా?
సచ్చిన పోవు పీడ యను సంతస మేమియు లేకపోయెగా!
కచ్చగ మాటలాడి మరి ఖండితనైతిని పేర్మి లేకయే!
(పలుగాడి – తలుపు)

**6. కలహాంతరిత**

ఉ. ఏ పని లేనిదాన వలె నీసున దిట్టితి నెందు బోయెనో
మాపునకైన రాడొ మరి మామకు కోపము పోవు టెట్లో యా
చూపుల పేర్మియే గురియు చూడకపోతిని చోద్యమేమిటో
పాపిన యాతడే తిరిగి వచ్చిన బాగగు భావి యేమిటో!

**7. ప్రోషిత భర్తృక**

ఉ. వేళకె వచ్చుచుందువని వేడిగ జేసితి వంటలెన్నియో
హేలకు రాకపోతివిగ హృద్యమె గాకను వేష భూషణాల్
తాళక తీసివేసితిని దండుగె కోకిల కూజితమ్ములున్
చాలిక రమ్మురా విభుడ సందిట పొందగ నన్ను విందుగా!

**8. అభిసారిక**

ఉ. రమ్మని పిల్వగా మదిని రంజిల సేయగ నూహలేవియో
నెమ్మిని సోకు సేసుకొని నీ యెద జేరగ సాటు కేగితిన్
కొమ్మను చేరెనో యగము, కూడెను మబ్బులు, బేల కానుగా
ఇమ్ముగ నాగమించుమయ నీ యభిసారిక వేచి యుండెగా!





## పోచిరాజు కామేశ్వరరావు

**1. స్వాధీనపతిక**

నర నాథుండు మహోగ్ర వీరుఁ డరి సైన్యవ్రాత భీభత్సుఁడే
తిరుగన్నేరఁడు నెన్నఁడేనియు వినాదేశమ్ము నన్నెంచుచున్
వర దానమ్ములు పెక్కు సేయుఁ దమి సంభావించి నన్నెంతయుం
దరుణీ రత్నమ యేలు నన్ననెడు భర్తం గంటి భాగ్యమ్మునన్.

**2. వాసకసజ్జిక**

శిర మందుంచెను రత్న మింపుగను గౌశేయాంబర శ్రేష్ఠ మూ
ని రమా సన్నిభ స్వర్ణ కుండలము లూనెం గర్ణ యుగ్మంబునన్
వర జాంబూనద హార కంకణ నసాబం ధేద్ధ కేయూరముల్
తరుణీ రత్నము మేఖ లాకలితయై తా వేచె నాథార్థమై.

**3. విరహోత్కంఠిత**

రాకేందు ప్రభ లయ్యె నా కకట దుర్వారాగ్ని కీలాభముల్
కాకాక్రోశము లయ్యెఁ గర్ణముల భృంగ ద్వంద్వ ఝుంకారముల్
కాఁకం దుల్యము చంద నాగరులు తీక్ష్ణజ్వాల రింఛోళి క
య్యో కామోద్ధతి సైఁప నోపఁ బతి సంయోగార్తి నో దైవమా!

**4. విప్రలబ్ధ**

నీలాకాశము నందుఁ జందురుఁడు డహో నిద్రించె నిట్టూర్పులే
నాలో రేఁగెను దెల్లవాఱె నకటా నా యీ ప్రసూనమ్ములే
నేలం గూలెను వాడి నే విసర తేనిం జూడ రాదయ్యెనే
కాలం బెల్లయు వ్యర్థ మయ్యెను రమాకాంతా! దయం జూడవే!



ప్రియుని తొలుత తూలనాడి గృహమును వీడగ,
తదుపరి అతనికై పశ్చాత్తాపంబున విలపించు కమలాక్షి – కలహాంతరిత





**5. ఖండిత**

పర భామా రతుఁ డయ్యెనో వలపె నాపై క్షీణమై పోయెనో
పరుషమ్ముల్ పలుకంగ నేర్చె నకటా భారంబు నే నైతినే
కర మాశ్చర్యము నాథు వర్తన మహంకారమ్ము పేట్రేగెనే
దురితం బే నిట నేమి సేసితి నయో దుర్భాగ్య మయ్యెం గదా!

**6. కలహాంతరిత**

సత తాసత్య వచో ధురంధరుఁడు నిస్సారుండు దుర్భాషుఁడున్
గత సంస్కారుఁడు కాల యాపనుఁడు శంకవ్రాత చిత్తుం డహో
విత తావేశ మనస్కుఁడే యనుచి తోద్వేగుండు నెట్లయ్యెనో
మతి నే నెంచను వీత రాగు నిఁక నంబా నాథు నే వీడుదున్.

**7. ప్రోషితభర్తృక**

ధన మార్జించ నిజాత్మనాథుఁ దురు విద్యావేత్త తా నేఁగఁగా
ఘన దూరాపరదేశ వాసమునకై కాంతా విహీనమ్ముగా
వనవా సావనిజాభవైతి సఖి దుర్వారంపు సంత్రాసమే
నిను నిత్యమ్మును వేఁచునే యను గిరల్ నే నింక నెట్లోర్తునో!

**8. అభిసారిక**

సరసాలాప మృదూక్తి సారఘు రసాస్వాద ప్రమోదంబునన్
వర చేలోజ్వల హేమ భూషణ మహా వర్ష్మమ్ముతో వెల్గుచున్
దరహాసమ్ము ముఖారవిందమున నుద్భాసిల్ల సంరంభియై
గిరులన్ దాటి లతాంగి పర్వులిడె సంకేతస్థలం బేఁగఁగన్.

# రాధాకృష్ణ రేగళ్ళ

**1. స్వాధీనపతిక**

సీ. సంప్రదాయములెల్ల సహనముం బాటించు
　　శాంతచిత్త లలన సరస హృదయ
సౌందర్య సంపద చాల నున్న పడతి
　　మగని కొంగున గట్టు మాటకారి
భర్తకే భూషణ భాషణ లాలన
　　భర్తచే ప్రేమింపబడెడు పడతి
పడకటింట మగని బానిస గావించి
　　ప్రణయంబు సాగించు రమణి లలన
తే.గీ. మగడు జేసెడు మురిపాల మరచి మేను
సర్వమర్పించి ప్రణయాల సారమంది
మగని గుండెలో కొలువైన మగువ నేను
ప్రమదనందురు స్వాధీనపతిక నన్ను.

**2. వాసకసజ్జిక**

సీ. పెనిమిటి రాకకై వేచియుంటిని నేను
　　ఖదిరునికై జూచు కలువరీతి
సర్వ భూషణధారి సరసిజ నయనను
　　సాయం సమయమందు సఖుని కొరకు
పద్మాలు గలువలు బహురీతి పుష్పాలు
　　వేడుకతో పేర్చి వేచియుంటి
బహుదూర పయనంబు బరసి వచ్చిన భర్త
　　బాహుల పొందుకై పలవరింతు





తేగీ. విరహ తాపంబు నేనింక వేగలేను
మగని పొందుకై మేనంత మైకమొంద
వేచియుండెడి నన్నంద్రు వేడ్కమీర
సకియ వాసకసజ్జిక జనులు నన్ను.

**3. విరహోత్కంఠిత**

సీ. సాయంసమయమందు సవరించిన పడక
　　మధ్య రాత్రికినైన మడత బడక
జడలోన దురిమిన జాజుల దండలు
　　వాసన గోల్పోయె వాడకుండ
మగనికై రేయంత మగత గన్నుల జూడ
　　మోమంత వాడెను మోడురీతి
కలువరేకుల వంటి కన్నులు నేద్వగ
　　చెక్కిళ్ళ కాటుక జీరలంటె
తేగీ. రాత్రి వత్తుననుచు బోయె రాకబోయె
విరహమిది యెట్టు దీరగ వేగలేను
జాలిగ విరహోత్కంఠిత జనులు బిలువ
విసిగి తీరని కోర్కెతో వేగుచుంటి.

**4. విప్రలబ్ధ**

సీ. రానున్న ప్రియునికై రాంత్రంత వేచుచు
　　రాజీవ మిత్రుని రాక వేళ
పడకగదినినున్న పర్యంకమున జేరి
　　దిండులో తలదూర్చి దిగులుపడుచు
తన భాగ్యమందంబు దలచుచు వగచుచు
　　మోసపు చెలికాని మోము గనక
చెవుల కమ్మలు దీసి చీరలు రవికలు
　　చెదురుగా విప్పేసి చెలుని దిట్టు

తేగీ. రాని ప్రియునిపై కోపించు రమణి నేను
మాటదప్పిన చెలికాని మందభాగ్య
జనులు బిలుతురు నామీద జాలి జూప
ప్రియుడు వంచింప వగచెడి విప్రలబ్ధ.

**5. ఖండిత**

సీ. వచ్చెదనని జెప్పి వదిలియు వెడలిన
చెలికాని మోసము చెవుల బడగ
రాత్రంత వేరొక పడతితో రమియించి
వేకువ జామున వచ్చినతని
బిగిసిన మోమున బిడియము వదిలేసి
భారముగా శ్వాస వచ్చుచుండ
కరుకైన మాటల గాయాలు జేయుచు
భర్తను నిలదీసి బలిమి జేయు
తేగీ. భర్త నమ్మకద్రోహము బయలు బడగ
పతిని నెదిరించి దూషించు పడతి నేను
ప్రియుని వంచన నెదిరింప పేరు వచ్చె
నేను ఖండితనైతిని నేర్పుతోడ.

**6. కలహాంతరిత**

సీ. ప్రియునితో పోట్లాడి వెడలిన ప్రియురాల
ప్రియునికై తపియించి ప్రేమ బాసి
పరిపరి రీతుల పరితాపమొందుచు
మనసంత వికలమై మ్రానునైతి
గతకాల తలపులు గతమైన ప్రేమలు
చిత్రలహరిలాగ చిత్తమందు
మనసు కలతనొంది మదిలోన తెరలుగా
మరల మరల వచ్చి మనసు చెరచె





తేగీ. ప్రియుని యెడబాటు బొందగ ప్రేమలేక
మనసు మనసులో లేకుండ మాయగమ్మి
బతిని విడనాడి వగచెడి బతితనైతి
నాతి కలహాంతరిత యంద్రు నన్ను జనులు.

**7. ప్రోషితభర్తృక**

సీ. బ్రతుకుతెరువు గోరి పతి యేగె పరభూమి
కెన్నేండ్లకో గాని యెగిరి రాడు
వాడు వచ్చువరకు వాడికి దూరమై
మనలేను లేకుండ మగని పొందు
సఖులార మీరెంత సౌఖ్యమిచ్చిన గాని
మగడు లేని దిగులు మరువలేను
చెప్పరే యెవరైన చెలికాని కడకేగి
వాని ప్రేయసి బాధ వాడు లేక
తేగీ. ప్రియుడు పరదేశ మేగెను వీడి నన్ను
వాడి పొందులేక మనగ భారమయ్యె
అట్టి నన్నంద్రు జనులెల్ల రలుసు జేయ
చామ ప్రోషితభర్తృక జాలితోడ.

**8. అభిసారిక**

సీ. ప్రియుని కొరకు నేను రేయి పగలనక
పలువరింతును సిగ్గు భయము లేక
కట్టుబాట్లు వదిలి గట్టి తెగువ గలిగి
సంఘము నెదురించు జాణ నేను
ప్రణయంబు ప్రియునితో పరమార్థమని నమ్మి
వాని పొందు కొరకు బారిబోవ
సంకేతమగు చోట సాహసమ్మున జేర
కష్టము లెన్నైన గాచుకొందు

తేగీ. ప్రియుని గలియుట మాత్రమే ప్రియము నాకు
సిగ్గు భయముల విడిచితి జేరవాని
బాధ లెదురైన వెరవక పయనమైతి
ప్రియునికై యభిసారిక బిలుతురంత.

**(ఫోన్: 065-91126318, 065-67777015)**





# రాధ వాడపల్లి

**1. వాసకసజ్జిక**

చం. పతి తన పజ్జ జేరునని, వాకిట కన్నుల కాపు బెట్టుచున్,
సతమును పాన్పు మీద నతి చక్కని పూవుల నేర్చి గూర్చి తా
నితరపు ధ్యాసలేక తమి హెచ్చుగ మంజుల భావ పూర్ణయౌ
యతివను గూర్చి యారయగ నా సతి వాసకసజ్జికే సుమా!

**2. స్వాధీనపతిక**

చం. తనదగు సోయగమ్మునకు దాసుడుగా తన భర్త నెంచుచున్,
మనసును దోచుకున్న సఖి, మంజుల భాషల నెల్లవేళలన్,
నను బతి వీడబో దనుచు, నాథుని కొంగున గట్టుకొన్నటుల్,
కనుగవ గర్వరేఖ లవి కాంచగ నామెయె ధీరయౌ సుమా!

**3. విరహోత్కంఠిత**

చం. కనుగవ నీరు జారగను కాంతుని కోసము వేచి వేచి, యే
మనకను వాని బేర్కొనుచు, మానుపజాలని దుఃఖ భారమే
మనమున నిండగా, వివశ మందుచు, "రా డిది యేమి?" యంచు, వే
దన పడు కోమలిం గనగ, దా విరహోత్సుక నాయికాఖ్యయౌ!

**4. విప్రలబ్ధ**

చం. 'గడచెను రేయి, రా డికను ! కాంతుడికే చెలి జేరబోయెనో?
విడిచెను నాదు మాట' యని, వీడని దుఃఖము తోడ కోపియై,
తొడిమను వీడు పూవు వలె దూలగ పానుపు పైన బాధతో,
వడి జని నెచ్చెలుల్ దయను పంచగ జూతురు విప్రలబ్ధకున్!

**5. ఖండిత**

చం. సమయము దాటిపోవ, బతి సన్నిధి జేరగ లేని బాధతో
గుములుచు, వాని మీద నతి కోపము జేతనె తూలనాడుచున్,
బొమముడి వేసి నిష్ఠురము బొందగ దిట్టుచు, రోష పూర్ణయై,
కమలము వాడినట్లు గల కాంతను 'ఖండిత' యందు రెప్పుడున్!

**6. కలహాంతరిత**

చం. "వలపులు నింపు మాటలను వాసిగ నే చెలి తోడ జెప్పితో?
పలుకక పొమ్ము నీవటకు ! పంతముతో నను జేరబోకు! నా
కలలిక దీరిపోయె!"నని కాంతుని దూషణ జేసి, యా పయిన్
జలజల కంట నీ రొలుక, చాలగ చింతిలు చుండు నీమెయే!

**7. ప్రోషితభర్తృక**

చం. "తడయక నేడు వత్తునని తప్పక చెప్పుచు దూర దేశమే
వడి జనినాడు గాద, మరి వాడిక నేడిటు రాక పోయెనే!
గడిచెను రేయి! వచ్చునిక, కాంతుని జేరుదు నన్న యాశయే
మడిసెను దైవమా!" యనెడు మానిని ప్రోషితభర్తృకే సుమా!

**8. అభిసారిక**

చం. సరుగుడు చెట్ల మధ్యగల చక్కని మామిడి చెట్టు నీడలో
పరులకు గానరాని విధి, పల్చని వెన్నెలలో బ్రియుం దెస
న్నరుగుచు జెట్ల క్రిందుగను చాటుగ చిక్కటి నీడ వెంబడిన్
సరగున బోవు గాంత యభిసారిక యౌనయ యెంచి చూడగన్!





## శ్రీసత్య పర్వతనేని

**1. స్వాధీనపతిక**

తే.గీ. బడలి వచ్చిన భర్తకు పాదసేవ
జేసి మధుర పానీయాల సేద దీర్చి
సరస సల్లాపములతోడ శాంత పరచి
మగని మనసును దోచిన మగువ నేను.

**2. వాసవసజ్జిక**

కం. కాటుక కన్నుల చిన్నది
మేటి వలపు కాని కలియ మేన సుగంధాల్
పాటవముగ నలది నిలచె
బాట దెసను జూచు మోహ భావన తోడన్.

**3. విరహోత్కంఠిత**

కం. రాదేలనింక మగడున్
వాడిగ మన్మథ శరములు బాధింప ననున్
మాడిచె చంద్రుని వెన్నెల
వేడిమి తాళగ తరంబె బేలను కాదే?

**4. విప్రలబ్ధ**

కం. సిగలో పూమాలేలన్
విగతం బాయెను సరసపు వేడుక నాకున్
పగలాయెదాక రాడే
నగలేలను మోసగించె నాథుడు నన్నున్.

**5. ఖండిత**

కం. వన్నెల మారిని కూడితె?
పన్నుగ నీకై నిలచిన భామను కానే?
మిన్నున సూర్యుడు పొడిచెను
ఎన్నగ లే మవగుణముల నిటువంటివెగా.

**6. కలహాంతరిత**

కం. సముఖాన పరుల మెచ్చగ
విముఖత కలగుట సహజము విరసము కాదా?
తమరిని విడనాడక నే
సమరస భావాల నుండ జాలను మగడా!

**7. ప్రోషితపతిక**

కం. ఎటులుండెనో కదాయని
యట మనసూరుకొనదంచు నటమట పడుచున్
పటుతర మోహభ్రాంతుల
నెటులోర్తు సఖీ విరహము నీ ప్రొద్దులికన్.

8. అభిసారిక

కం. భయమేల నాకు నీదరి
రయమున చేరగ వెరవను రాతిరి వేళన్
పయనించే మది తోడన్
శయనించగ నీ యురమున సంతోషముగన్.





# సూర్య కటకం

**1. స్వాధీనపతిక**

కం. నాథుని దన దాసుడనును
స్వాధీనపతిక చెలగెడి స్వార్థము దోడన్
రాధనమున ప్రియసఖుడా
రాధించును దన నను, ననురాగము మీరన్.

**2. వాసకసజ్జిక**

కం. బాసను మరువక వేగమె
రా సఖుడా నీకొరకిక రాతిరియంతన్
చేసెద శయ్యాగృహమున
వాసకసజ్జికగ వలపు వద్దన నేనే.

**3. విరహోత్కంఠిత**

కం. సరగున సరసకు రారా
సరసము లాడగ సరియగు సమయమిదేరా
మరుని శరమ్ముల కోర్వను
విరహోత్కంఠితనిక నను వేధింపకురా.

**4. విప్రలబ్ధ**

కం. పొమ్మిక నయగారపు నీ
కమ్మని మాటలు వినంగ కల్లలె కావా
వమ్మై జనె నా యాశలు
నమ్మిననే విప్రలబ్ధనైతిని సఖుడా!

**5. ఖండిత**

కం. పరకాంతా వ్యామోహపు
పొరగమ్మెను నీ మదినిక పో పొమ్మిక నా
సరసకు రాబోకు మనుచు
కరకుగ దెలుపును సఖునికి ఖండిత దానే.

**6. కలహాంతరిత**

కం. పలికితి పరుషముగానే
కలిగించితి బాధ నీకు కాఠిన్యముతో
దెలిసెను నా తప్పిద మిక
కలహాంతరితను నను సఖ క్షమియింపుమురా!

**7. ప్రోషితభర్తృక**

కం. నేరను నేనే నేరము
దూరము జేసెను మనలను దుర్విధి యిటులన్
రారా ప్రోషితభర్తృక
కారాటము నెడము సేయగా ప్రియసఖుడా!

**8. అభిసారిక**

కం. నవలావణ్య లలామను
జవరాలిని సఖుని జేర సరగున నేనే
జవనపు గమనమున జనెద
నవరోధములకు జడవని యభిసారికనే!





# సువర్ణ విజయ

**1. స్వాధీనపతిక**

తే.గీ. సుగుణవతి సుకుమారపు సుందరాంగి,
ప్రేమభరిత వాత్సల్యాన ప్రియుని జేరి,
తిలకమును దిద్దుమని వేడు లలితశోభ,
ధీరుని వలపు గెలుచు స్వాధీనపతిక.

**2. వాసకసజ్జిక**

తే.గీ. సకల భూషణధారిణి సరసిజాక్షి,
కుసుమమాలల తోరణాల్గూర్చి వేచి,
శయ్య నమరించి శృంగార సరసమాడు,
వనిత వాసకసజ్జిక పతిని గూడు.

**3. విరహోత్కంఠిత**

తే.గీ. తహతహలు మీర వలపుల తమ్మికంటి,
విభునికై నిరీక్షించుచు విచలిత మది,
చందనాది లేపనలతో శాంతి లేక,
తాపమును తాళక విరహోత్కంఠిత యగు.

**4. విప్రలబ్ధ**

తే.గీ. తెల్లవార వచ్చె సఖుని తెఱువెరుగదు,
వేచి వేసారి తొడవుల విసిరి వేసి,
కోపగ్రస్తయై మదిరోసి కుములుచున్న,
విప్రలబ్ధ వ్యాకులకాంత వేదనార్త.

**5. ఖండిత**

తే.గీ. అన్యకాంతను గూడెనో యనుచు వెఱచి,
నిప్పులు చెరిగె కన్నుల నీలవేణి,
ఖండిత సఖి క్రోధముతోడ కలత చెంది,
దండమెత్తె దండించగ ధవుని పొలఁతి.

**6. కలహాంతరిత**

తే.గీ. క్రోధమున బయలువెడలె కువలయాక్షి,
వాడిమాటల తూటలు వాడి వాడు,
కలహమాడెనని వగచి గడప దాటు,
చింతల కలహాంతరిత తా చిగురుబోడి

**7. ప్రోషితభర్తృక లేదా ప్రోషితపతిక**

తే.గీ. దూరప్రాంతము జనెనని దుగ్ధపడుచు,
ప్రాణనాథుని తలచుచు వగచుచుండు,
ప్రోషితపతిక నోదార్చు పొలతుల గన,
చూపు ద్రిప్పక శోకించు రూపవధువు.

**8. అభిసారిక**

తే.గీ. త్వరితగతిని కాంతుని జేర తరుణి వెడలె,
పరుగున జన పసిడియంచు పైట జారి,
మన్మథ శరము ల్సోకగ మదిని, ప్రియుని
సంగమించభిసారిక సాగె వేగ.





# టి.టి. శర్మ

**1. స్వాధీనపతిక**

ఉ. గిచ్చిన గీటు దాటడిటు కేలును వీడదు ప్రేమమూర్తియై
నిచ్చలు నా మనంబునకు నీడగ నుండును ముద్దు సేయుచున్
నచ్చెను నాకు నా విభుడు నమ్ముడు నా చెలులార యంచు తా
మచ్చికయైన యా మగని మానిని జూపును తోటివాండ్రకున్.

**2. వాసకసజ్జిక**

ఉ. వేడుకలాయె నా మదికి వెన్నెల వచ్చెను జీవితంబులో
వాడిపు దేగుదెంచు నిట వానికి నింపును గూర్చ గేహమున్
చేడియతోడ దిద్దితిని చెప్పగజాలను వాడి రాకతో
నేడిక పండుగాయనని నిండుగ సంబరమొందు నత్తఱిన్.

**3. విరహోత్కంఠిత**

ఉ. చెప్పిన వేళ దాటినది స్నేహితులందరితోడ వేడ్కతో
గొప్పలు చెప్పుకొంచు తన కోరికలచ్చట తీర్చుకొంచు, నా
తిప్పలు లెక్కజేయకనె తీరికగా నటు జేరె నేమిటో?
యెప్పుడు నేగుదెంచునొకొ! యెట్లు భరింతును ప్రేమవేదనల్.

**4. విప్రలబ్ధ**

ఉ. రమ్మని చెప్పె నా ప్రియుడు రాతిరి యాయెను రాకపోయెనే
నమ్మికతోడ నన్నిపుడు – నమ్మిక వమ్మయె మోసపోతినే
నెమ్మిక జూపి నా మనసు నీదని జెప్పెను బేలనైతినే
సొమ్ముల సోకులెందుకని సొమ్ముల నన్నిట తీసివేసెడిన్.

**5. ఖండిత**

ఉ. భాతిగ వస్త్రమంతటను భామిని కాటుక గుర్తులేమిటో
రాతిరి యంతయున్ రమణి రాగిణితోడను రాసలీలలా?
పత్నిగ నన్ను జేసికొని పాపపు కాంతను సంగమించగా
నీతిని దప్పినావనుచు నీరజలోచన యేడ్చునత్తరిన్.

**6. కలహాంతరిత**

ఉ. ఎంతగ జెప్పినన్ వినక నేమరుపాటున వెళ్ళగొట్టితిన్
సుంత దయాభిమానమును చూడక నయ్యెయొ! ప్రాణనాథు దా
నెంతగ కుందినాడొ! మనసెంతగ బాధను నొందియుండెనో!
పంతము వీడనైతినని భావమునన్ దలపోయు బాధతో.

**7. ప్రోషితభర్తృక**

ఉ. చక్కనివాడు నా మగడు సాదర మొప్పగ ప్రేమభావముల్
మిక్కుటమైన రీతిగను మెప్పును బొందగ నందజేయుచున్
మక్కువ జూపుచుండునని మానిని బల్కుచు భర్త రాకకై
జక్కువ వోలె తానెదురు జాడలు జూచును దుఃఖమగ్నయై.

**8. అభిసారిక**

ఉ. తోటకు జేరరమ్మనెను తొందరగా నను జాగుసేయకన్
వెంటనె నే జనంగవలె వేగముగానని తత్తరంబుతో
కాటుక దిద్దితీర్చి నగ కంఠమునందున జేర్చి వైళమే
తోటకు జేరి యా ప్రియుని దోయిలి తోడుత కౌగలించెడున్.





# టేకుమళ్ళ వెంకటప్పయ్య

**1. స్వాధీనపతిక - రుక్మిణి**

సీ. శ్రీపతికృష్ణుండు శ్రీసతి రుక్మిణి
        నీర క్షీరము వలె నిలిచియుండ్రి
వాసుదేవు దచట వాత్సల్య ముప్పొంగ
        గోరింట బెట్టుచు గొమ్మ కయికి
నన్నపానంబుల నతివకు నిచ్చెడి
        మధుర ఘటనలెన్నొ! మహిమలెన్నొ!
స్వాధీనపతికకు సాక్షిగ నిలిచెను
        అష్టమహిషులందు నంబుజాక్షి!

గీ. పారిజాతమ్ము నాడిచ్చె పద్మముఖికి
కలికి పట్టపురాణిగ ఘనత బొందె
భర్త ప్రేమను బొందిన భామ తాను!
కల్లకపటము లెరుగని కమలనేత్రి.

**2. వాసకసజ్జిక - జాంబవతి**

సీ. ఏల రాడోయమ్మ నేమాయె! జెలులార!
        వేచి వేగితి నేను వేధ నిండె!
గన్నుల గాచెను గాయలు గనలేర!
        నా స్వామి రాడేమి నన్ను జేర!
ఉదయాద్రి తెలుపాయె! నుడురాజు కనరాడు
        గంధపు మైపూత గరిగిపోయె!
సంపంగి పూమాల, సవరమ్ము వదులాయె
        జాలి తలచదేమి జాంబవతిని

గీ. దూరపయనమ్ము కేగగ దుఃఖమతిగ
పతిని మదిలోన దలపోసి పరితపించి
భోరుభోరున విలపించు పుష్కలాక్షి
గాంచ వాసకసజ్జికై గానుపించు!

**3. విరహోత్కంఠిత – కాళింది**

సీ. ఎపుడు వచ్చునొ నాథు డెపుడు వచ్చునొ గదా!
తలపుల దడయుచు దడిసె మేను!
చెలులార! సఖులార! చెప్పరేమేలనే!
కస్తూరి గంధమ్ము గారె ధార!
మల్లెపూదండలు మండించె విరహమ్ము
విరజాజి మరువమ్ము వేడి బెంచె!
తల్పమ్ము మిక్కిలి తాపమ్ము నింపెను
కాళింది కడగండ్లు గాంచదేల?
గీ. విరహతాపమ్ము నందుచు వేగిపోవు
ద్వారబంధమ్ము వీడని దైన్యవదన
వేరు భావమ్ము దలచని విమలనయన
నాయిక విరహోత్కంఠిత నరయగాను!

**4. విప్రలబ్ధ – నాగ్నజితి**

సీ. కోసల దేశమ్ము గొమ్మలు వంచిన
కన్నయ్య రాడేమి కౌగిలించ
సంకేత తలముల సంగతిన్ మరచెనా
నగవు చూపుల తేడు నల్లనయ్య
నమ్మిన నాతిని నాగ్నజితిని బొంద
నా ప్రాణనాథుండు నన్ను మరచె
నాభరణమ్ముల యవసరమ్మికనేల?
నది యందు వేసెద! నాకు వలదు!





గీ. విరహ బాధతో విలపించి విధిని దలచి
మోసమందితి ననుచును మొత్తుకొనుచు
మదిని రోదించి వ్యాకుల మందుచుండ
బిలిచెదరు విప్రలబ్ధయన్ బేలనపుడు!

**5. ఖండిత – భద్ర**

సీ. కానదు వావియు గానదు వరుసలు
చెలుల చెంగులబట్టి చెలగుచుండు
మేనత్త గూతురై మేలిమి బంగరు
మేనిచాయలతోడ మెరయుచుండు
భద్ర నేల మరచె బలరాము ననుజుండు!
కోక గట్టిన జాలు కుబ్జలైన
వలపుసేవులలోన వర్ధిల్లు మొనగాడు
వదలంగ లేనిక వాసుదేవ!
గీ. పడతి గుర్తులు పతిమేన పట్టిసూపి
తగదు పరకాంత పొందుల తగదటంచు
దరికి జేరిన నాథుని దరిమికొట్టి
భగ్గుమని మండు ఖండిత భద్ర గాదె?

**6. కలహాంతరిత – సత్యభామ**

సీ. నీవు గీచిన గీటు నే నెప్డు దాటను
నమ్ముమటంచును నమ్మబలికి
పారిజాతమ్మును పరసతులకు నిచ్చు
నళినదళాక్షుని నైజమేమి?
నమ్మి చెడితి నేను నాకిక దిక్కేది?
నేనొల్ల నేనొల్ల నీరజాక్షు!
సవతి రుక్మిణితోడ సరసమ్ము మునిగి యీ
సత్యభామను వీడు కృత్యమేల?



ప్రియుడు దేశాంతరముల కేగ విరహమున అతనినే తలచుచు
పరిపరి పరితపించు ప్రోడ - ప్రోషితభర్తృక





గీ. తొలుత గోపించి తదుపరి తొట్రుపడుచు
దిగులు నొందెడి ముదితలు దివిని భువిని
గలరు బెక్కండ్రు గాంతలు గాంచగాను
వారె కలహాంతరితలని వాసిగనిరి!

**7. ప్రోషితభర్తృక - మిత్రవింద**

సీ. అఖిల లోకమ్ముల నవలీల గెలిచెను
దా స్వయంవర గిరిధారి నన్ను!
ధీరుండు శూరుండు దేవకీ సుతుడేల
మిత్రవింద యనెడి మెలత మరచి
కానరాడేలకో! కారణంబేమిటో!
హస్తినాపురమున హాని జేయు
పలువురు దుష్టులు ప్రబలిన విషయమ్ము
పలికి వెడలె మున్ను పద్మముఖుడు

గీ. పతికి దేశాంతరమ్మున పనుల వలన
చేరలేదని దెలియక చింతగొనియు
గుందు ప్రోషితభర్తృక గుబులుతోడ
చెలుల చెంతను వారెల్ల సేదదీరు!

8. అభిసారిక - లక్షణ

సీ. వనమాలి నన్నేల వనమున గలియంగ
కబురంపినాడొకో కాళరాత్రి
కారుచీకటి క్రమ్మె గానరాదేమియు
వర్షమ్ము మొదలాయె వణకుచుంటి
పాములు తేళ్ళును పారాడు ధరణిపై
పరుగులెత్తితి నేను పతిని జేర
లక్ష్యమ్మె మది నిల్పు లక్షణ నాయికన్,
పొందుగోరితి నన్ను నందుకొనుమ!

గీ. ప్రియుని జేరంగ వనితలు ప్రేమనరసి
చావుబ్రతుకుల కెదురొడ్డి చంచలముగ
పరుగులిడుదురు భయమను బాధ మరచి
వారె యభిసారికాఖ్యను వాసికెక్కు!





# తిరుక్కోవళ్ళూరు శ్రీహర్ష

**1. స్వాధీనపతిక**

శ్రీమతి సోయగమ్ములకు చిక్కిన శ్రీపతి కీలుబొమ్మ! సం
గ్రామము లుండబో వచట కాపురమందున చక్రవర్తి నీ
భామ, గృహమ్మునేలు, పతి బానిసయౌచు పదమ్ములొత్తుచున్
కోమలి కొండపైన నొక కోతిని కోరిన తెచ్చు వేగమే!

**2. వాసకసజ్జిక**

వారిజనేత్రి సోయగము వర్ణన జేయ తరమ్ముగాదు; సం
భారకుచద్వయమ్ముపయి భాసిలుచుండగ తారహారముల్,
నారి నవారుణాంబరము నాకముకై తపియించుచుండ, వ
య్యారి నిరీక్షణమ్ము పతియందు రమింప ఫలించు సెజ్జపై!

**3. విరహోత్కంఠిత**

భారము జీవితమ్ము; పనిభార మటంచు విభుండు రాడు; శ్రీ
కారము జుట్టి వండితిని కమ్మని వంటలు నేర్పుమీర; నీ
పూరము లెండిపోవునిక పోషకముల్ రసముల్ నశింప స్వీ
కారము జేయ వ్యర్థమని కామిని చింతిలె ప్రేమదూరయై!

**4. విప్రలబ్ధ**

వేలను జేసి యీ దరికి ప్రేమ నటించియు, చేరబిల్చి, యు
ద్వేల తరంగమై, విరహవేదన నన్నిట ముంచివేయ, స
మ్మేళన మొంద రాడు పరమేశ ప్రియుండని త్రెంపి హారముల్,
ఫాలము జ్వాలయై వెలుగ భగ్గున మండెను విప్రలబ్ధయే!

5. **ఖండిత**

పండిన పేర్మి మెండుగను పాయసమందున రంగరించి, పూ
దండ లలంకరించి, సఖ! తన్మయమొందుచు వేచిచూడ, కా
ముం డట ప్రక్కయింటి సతి పుల్లని కూరను మ్రెక్కెనంచు, వే
ఖండిత దండమున్ గొనుచు కాముని దండనజేసె మండుచున్.

7. **ప్రోషితభర్తృక**

డాలరు కోసమై కదిలి ట్రంపును జేరియు కంపుచేష్టలన్
మేలని మేలు మేలని యమేరికలో నొక దాసుడై కటా
బేలను జేసెన్ సఖుడు ప్రేమను పంచగలేడు నేడు తాం
బూలము వ్యర్థమయ్యెనని ప్రోషితభర్తృక క్రుంగె నేడ్చుచున్.

8. **అభిసారిక**

హే వనజాక్షి! నీ వలపదెంత ప్రగాఢమొ యీ ప్రపంచమున్
క్రేవనబెట్టి నా కొఱకు ప్రేమసుమమ్ముల నందజేయ సం
సేవన జేసి దుఃఖములు, క్షీరమొసంగితి వీవు నెచ్చెలీ
సావిరహే! యటంచు నభిసారిక నీకృతి పాడుకొందునే!





# తురిమెళ్ళ రాధాకృష్ణమూర్తి

1. **స్వాధీనపతిక**

చూపుల తూపుల న్నెదను సొంపుగ నాటుచుఁ బ్రేమఁ బెంచుచున్
రూపము శీలమున్ గలిగి లోకము మెచ్చగ సేవఁజేయుచు
న్మాపటి వేళలో మరుని మందిర మందున సౌఖ్యమొందుచు
న్నేపుగఁ గొంగునన్ విభుని నింపుగఁ గట్టెడు నాతి యియ్యదే!

2. **వాసకసజ్జిక**

మోహము తోడుతన్ రగిలి మోహన రాగము నాలపించుచు
న్నూహలఁ దేలుచున్ మదిని నొయ్యన దేహ మలంకరించుచున్
గేహము నుంచు నందముగ, కీల్జడ వైచును, తన్మయంబునన్
బాహిర మెల్లెడన్ మరచు, వాసకసజ్జిక భర్త రాకకై.

3. **విరహోత్కంఠిత**

ఏ విధి నిల్తునో! ప్రియుడె యింటికి రా డెటు వోయెనో కదా!
ఆవిరి యాయెనంచు మది నాశలు, రంజిల రాగ మొందుచున్
భావజ కేళినిన్ దలచు, పౌర్ణమి రాత్రులఁ గన్నుమూయకే
జావళిఁ బాడుచున్ రగులు, స్వాంతము నందున నాథు నిల్పుచున్
వావిరి యూహలన్ విరహబాధల నొందునె యుత్సుకంబుతోన్!

4. **విప్రలబ్ధ**

ఏనట నుండెదన్ సఖియ! యేగుము నీవని సైగ తోడ నా
చానకు దెల్పగాఁ బ్రియుడు, సారసలోచన పోవు నాశతో
గానక నాయకున్నచట, కామముఁ దీరక తాపమొందుచున్
వానకు నానుచున్ వగచి వాసముఁజేరును విప్రలబ్ధయై
యండజయానలన్ మరిగి, హాయినిఁ బొందుచు కామకేళిలోన్.

5. **ఖండిత**

మండన మండితుండు పతి, మౌనముగా నిలుఁ జేరు వేళలో
నెండిన మోముపై వెలుగు నింతుల చుంబన ముద్రగాంచి, తా
దండిగ కిన్కబూని పరితాపము నొందుచు వేగుచుండు, నీ
ఖండిత కావ్యమందుఁ గన, కాముని జ్వాలకుఁ గ్రాగుచుండులే!

6. **కలహాంతరిత**

తోయజ నేత్రిపై మనసు తొందర వెట్టగ భామయింటికిన్
నాయకు డేగుదెంచి మరి, నాయిక పొందున కాస జేయుచున్
బాయని వేదనన్ సఖుడు, భావజు కేళికి నుద్యమించగాన్
వేయుచు నిందలన్ మిగుల ప్రేమను బంచక పంపు తిట్టుచున్
హాయినిఁ బొందలేక కలహాంతరితయ్యెడ దుఃఖమొందులే!

7. **ప్రోషితభర్తృక**

మారుడుఁ జంపుచుండె, మరి మౌనముగా విరహాగ్ని గాల్చుచున్
గోరిక లీరికెత్తి యెదఁ గోయుచునుండెను చంద్రహాసమై
చేరికఁ గోరుచుండె మదిఁ జింతలు హెచ్చె, వియోగబాధతోన్
చోరుడు, దోచె, నా మదిని సోయగ మెల్లను వ్యర్థమంచిలన్
బూరుషు రాకకై వగచు ప్రోషితభర్తృక పొందు తాపమున్.

8. **అభిసారిక**

అన్నుల మిన్నయౌ పడతి యాదర మొప్పగ సంతసంబుతో
నెన్నగ రాత్రియున్నవలు నెవ్విధి నైనను రాగమూనుచు
న్వన్నెలఁ జిల్కుచున్ బ్రియుని వద్దకుఁ జేరి విరాళిఁ జూపుచున్
చెన్నుగఁ గౌగిట న్నొదిగి శ్రేయము గూర్చుచు, పూరుషాళితోన్
సన్నుతిఁ బొందుచుండు నభిసారిక, సౌరును పంచుచుండగాన్.





# తుమ్మలపల్లి విజయలక్ష్మి

1. **స్వాధీనపతిక లేక స్వాధీనభర్తృక**

అగణిత గుణగణ మణియట
మగనిన్ తన ప్రేమచేత మత్తున ముంచున్
వగలాడికి చిక్కిన వా
డగునిక తా కొంగుచాటు నాథుడె గాడా!

2. **వాసకసజ్జిక**

అందముగ నలంకారపు
విందులు గూర్చి ప్రియురాలు వేచె ప్రియునికై
నిందీవర మాలలతో
పొందుగ నమరించియున్న పూపానుపుతో!

3. **విరహోత్కంఠిత**

ఏలను రాడింకను నా
మ్రోలను దా బదుట కన్న ముఖ్యంబేమో?
జాలము సేయక రావా
తాళగ లేనింక నేను త్వరపడు మోయీ!

4. **విప్రలబ్ధ**

రాడుగ, రాడింకను చెలి
కాడు దరికి మోసగాడు కాళిన్ వే నా
వాడని నమ్మితి నాకీ
నాడేల నలంకరణలు నగలున్ నట్రల్?

**5. ఖండిత**

తీరిక దొరకినదా యిక
వేరెవరిని మరిగినావు? ప్రియుడని నిన్నే
కోరిన ఫలమా యిది? నీ
తీరేమిటొ సంగతెల్ల తెలిసితిలేరా!

**6. కలహాంతరిత**

రాబోకు నాదరికి నిక
నీ బాధలను భరియింప నికపై పొమ్మా!
యీ బంధము వీడగ లే
నీ బేలను వదలిపోతి వేలా ప్రియుడా?

**7. ప్రోషితభర్తృక (లేక) ప్రోషితపతిక**

ఎంత సమయము గడచె నీ
వింత దనుక రాకపోతి వేమైనావో?
చెంతను లేవని వగచితి
నెంతగనో చెలుల వంక నింత గనకయే!

**8. అభిసారిక**

నిన్నే కలువగ నెంచితి
నెన్నియొ యడ్డంకులైన, నేమైనను నీ
సన్నిధి జేరుటకై నీ
యన్నులమిన్నను ప్రియుండ! నరుదెంతునురా!





## వెంకటేశ్వర ప్రసాద్

**1. స్వాధీనపతిక**

కం. అందముతో ప్రియునకు కను
విందును గావించి సతియు విడువక తానున్
పొందును 'స్వాధీనపతిక'
కందువ తన వెనుక ద్రిప్పు కామిని యగుచున్!

**2. వాసకసజ్జిక**

కం. వనితయు సాలంకృతయై
తన పతికిని ముదము గొల్ప తమకము తోడన్
గన 'వాసకసజ్జిక'యై
మనసిజుకై వేచిచూచు మధురోహలతో!

**3. విరహోత్కంఠిత**

కం. క్షణము నెడబాటు నోర్వక
మునిగియు విరహమున రగులు ముదితయు పతికై
గన 'విరహోత్కంఠిత' యగు
మనమున దుఃఖంబునొందు మరిమరి దలుపన్.

**4. విప్రలబ్ధ**

కం. తను వేచియు రేయంతయు
మనసిజు మోసంబు జేయ మందుచు దానున్
కనబరచు నసహనంబును
వనితయగును 'విప్రలబ్ధ' వంచిత యగుచున్!

5. **ఖండిత**

కం. పరకాంతల మరిగి ప్రియుడు
మరునాటికి నైన రాక మరచియు నుండన్
తిరుగబడును 'ఖండిత'యై
తరుణియు తా కోపమంది తప్పును దెల్పన్!

6. **కలహాంతరిత**

కం. చపలము ద్వేషము తోడుత
విపరీతపు కోపమంది వీడియు బ్రియునిన్
దపియించును; తప్పు తెలియ
కుపితగ 'కలహాంతరిత'యె కోరును పతికై!

7. **ప్రోషితభర్తృక**

కం. తన పతికై తపియించును
గనుపింపక దూరమేగ కన్నీరొలుకన్
వనితయు 'ప్రోషిత భర్తృక'
వినదెటు లోదార్పునైన విరహిణి యగుచున్!

8. **అభిసారిక**

కం. తన ప్రియు సంకేత స్థల
మును జేరును కష్టమైన ముదితయె తానై
కన 'నభిసారిక'యై తా
వెనుదిరుగదు ప్రియుని గలువ వెత లెదురైనన్!



అష్టవిధ నాయికలు

## విరించి

1. **స్వాధీనపతిక**

మీరదు గాదె నా పలుకు మిక్కిలి నమ్రతతో చరించుచున్
బేరిమి జూపి మల్లియలు వెన్న లిముద్దుచు ముద్దు తీర్చు నే
కోరిన కోర్కె తీర్చు నలకూబరుడే యత దందమందునన్
మారుని మించువాడు నవమన్మథుడై మురిపించు నిత్యమున్.

2. **వాసకసజ్జిక**

హద్దులు మీరినట్టి విలహమ్మున క్రాగిన సుందరాంగుడే
ముద్దులు తీర్చ జెంత కిట మోహము మీరగ వచ్చుచుండెనే
యొద్దికగాను మల్లియల నొత్తుగ జల్లితి గొప్పు వెట్టితిన్
ఖద్దరు చీర గట్టితిని గాజులు తీసితి కామకేళిలో
సద్దును సేయకుండ నిక జాగరమే కద రేయి యంతయున్.

3. **విరహోత్కంఠిత**

నా చెలికాడు వచ్చునిక నా చుబుకమ్మును ముద్దులాడగా
వీచెడు గాలితో కదలి, ప్రేయసి జేరవ దెందుకోయి? దో
బూచుల నాడుచుంటివని మోహము మీరగ నీదు రాకకై
వేచితినో ప్రియా! వెలుగు వెన్నెల స్నానము నాచరించితిన్!

4. **విప్రలబ్ధ**

"మల్లెలు దాల్చి వచ్చితిని మాతులు పుత్రుడ! పిల్చినంత నే
నెల్లలు దాటినాను సఖ! యెంతటి టక్కరి రాకపోతివే!
యుల్లము వ్రక్కలయ్యెను ప్రియుండవు కావిక వంచకుండ వీ
మల్లెలవేళ!" యంచు సతి మాలలు ద్రుంచుచు మున్గె నేడ్పునన్.

**5. ఖండిత**

బంగరు బొమ్మవంటి సతి ప్రక్కన నుండగ, వక్రబుద్ధితో
నెంగిలి కూటి కాశపడు హీనుడవైతివి! రాత్రులందు వా
రాంగనఁ గూడి వచ్చితివి! యల్పుడ వీవని తెల్సినంతనే
క్రుంగితి నీ ముఖంబుఁ గన రోతయె బుట్టుచునుండె వెళ్ళుమా!

**6. కలహాంతరిత**

కూడితివేమొ క్షుద్రనని కుందనమందుచు! మూర్ఖురాలనై
యాడిక వేసితిన్ మిగుల నగ్గడి కత్తెను గాదె? నన్ గనన్
వీడితివోయి నన్ను నొక విజ్ఞత వీడితినంచు నెంచుచున్!
నేడిక యొంటరైతి నిట! నిష్కృతి లేదిక నాకు నెప్పుడున్!

**7. ప్రోషితభర్తృక**

ప్రేమను వీడి సంపదల పెంచుటె లక్ష్యమటంచు నెంచుచున్,
నా మగ డేగె దేశము! ధనమ్మును పంపిన నేమి? పత్నికిన్
కాముని బాణముల్ తగిలి, కాంక్షల యగ్ని దహించుచుండగా,
నేమని చెప్పుకొందు? ప్రియుడెప్పుడు వచ్చునొ నాదు చెంతకున్!

**8. అభిసారిక**

కూరిమికాడు పిల్చెనని కోవెల దాపున నున్న తోటకై
చేరెడు వేళ, పెద్దలట చిక్కులు వెట్టిన లెక్కచేయ, క
వ్వారల కన్నుగప్పి, బుధవర్గము చూపుల కందకుండ నే
జేరితి, నూసులాడి, ప్రియశేఖరుఁ గూడగ నట్టి చోటికిన్.





## ఓలేటి స్వరాజ్యలక్ష్మి

**1. స్వాధీనపతిక**

ఉ. మంజుల మందహాసముల మాలిని పాదము లొత్తగా పతిన్
చంచల నేత్రముల్ గునిసి సన్నిధి బిల్వగ నానతీయగన్
అందము లారబోయగను అన్నులమిన్నకు దాసుడాయెగా
సుందర విగ్రహమ్ము గని చుంబన కాంక్షను జేరు భర్తయే.

**2. వాసకసజ్జిక**

ఉ. ముక్కెర ముత్తెము ల్వెలుగు ముచ్చటగొల్పగ భూషణంబుగా
చక్కెరమోవికి న్నరుణ కప్పుర వీడెము శోభనంబుగా
చక్కని మోమునం దెరుపు చందనలేపము తీర్చిదిద్దగా
చుక్కల చోళితో నెదురు చూచెను వాసకసజ్జి కారతిన్.

**3. విరహోత్కంఠిత**

ఉ. ద్వారపు సవ్వడిన్ భ్రమసి తల్పులు తీయగ వేగబోయె నా
వారిజనేత్రముల్ గలయ వాకిట నెవ్వని గానదాయెనో
నీరసచిత్తమున్ రమణి నీరము నిండగ నేత్రముల్ వడిన్
దీరని తాపమున్ శిశిరవీచిక వీవగ చేరి వేడెగా.

**4. విప్రలబ్ధ**

ఉ. రాతిరి యయ్యెగా ప్రియుడు రాడని కౌముది కాంతులన్ గనెన్
ఖాతరు సెయ్యగా వలదు కాదిది దుర్లభ మియ్యదీ రతిన్
ఆ తరులున్న చోటులను నా యువిదామణి రేయియంత తా
నత్తరి సంగమాగమపు కాంక్షను వేచెను నిర్భయంబుగన్.

**5. ఖండిత**

ఉ. ఎచ్చట దాగెనో ప్రియుడు నెచ్చెలి కౌగిట జొచ్చెనో మరే
ముచ్చట లాడునో సఖుడు ముచ్చిలి యే విరితోపు నుండెనో
తుచ్ఛము గాదటే చెలియతో నెకసక్కెము లాడగా పొరల్
పచ్చములేచనన్నడు మమాకని ఖండిత బాధ నొందెగా.

**6. కలహాంతరిత**

ఉ. బేలను వీడగా విభుని కేలను దోచెనొ యిప్పుడే విధిన్
బాలను నన్ను నేలుమని నా పతి నెట్లని వేడుకొందునో
మేలము లాడకే చెలియ మేలును గోరగ చెంతకున్ నెరిన్
ఆలుగనెంచి తాను కలహాంతరితాఖ్యగ బోవనెంచెడిన్.

**7. ప్రోషితభర్తృక లేదా ప్రోషితపతిక**

ఉ. దేశము వీడిపోయి సఖుడే తరుణీమణి పొందు గోరెనో
ఆశలు తీరునొక్కొ యికనయ్యెను రేబవలింక దుఃఖమున్
దేశము దూరమయ్యె పతి కేదిశ బోయెద నాత్మహత్యయే
దోసముగాదు మేలనుచు ప్రోషితభర్తృక నిశ్చయించెగా.

**8. అభిసారిక**

ఉ. జవ్వని భీకరాటవిని జాబిలి వెల్గుల గజ్జెలన్నెరిన్
సవ్వడి సేయకా సఖుని చక్కని చోటుల గల్వగా చనెన్
మువ్వల పాదము న్దిగిన ముళ్ళను చిమ్మిన రక్తమున్ గనెన్
యవ్వనమందునన్ చనియె నా యభిసారిక లెక్కసేయకే.





## ఊర ఈశ్వర్ రెడ్డి

**1. స్వాధీనపతిక**

ఉ. శ్రీసతి కంటనీరు పలుచిక్కుల నెన్నియొ తెచ్చిపెట్టగా,
బాసను జేసి చెప్పితిని, భార్యను దేవిగ జూడమంటి; నా
దోసము లెంచబోకు; పరితోషణ మొందగజేతు నిన్ను నీ
శ్వాసయు ప్రాణమున్ భువిని సాధ్వికి దాసుడవై మెలంగినన్!

**2. వాసకసజ్జిక**

ఉ. ఎన్ని దినంబులయ్యె ప్రభు నిన్నెడబాసి భరించలేనురా!
నిన్ను దలంచుచున్ మదిని నిద్దుర కంటికి కానసైతి! నా
కన్నుల నీరమింకె నిక గ్రమ్మెను చీకటి మానసంబునన్;
గ్రన్నన నేగుదెంచి బిగికౌగిలి నన్ ధరియింపజేయవే!

**3. విరహోత్కంఠిత**

ఉ. ప్రొద్దున నేగితీవు సరిపొద్దయె నింటికి చేరలేదురా!
నిద్దురలేదు కంటికిని నీకయి కాచుక కూరుచుంటి! నే
సుద్దులు వ్రాసి పంపితిని! సొంపుగ నింపగు పావురమ్ముతో
వద్దకు చేరి నా వలపు వాంఛను దీర్చగ వేగరమ్మికన్!

**4. విప్రలబ్ధ**

ఉ. శాపము పాపమున్నెరుగ! సర్వము నీవె యటంచు పల్కినన్
దాపుకు జేరబిల్చి కడుదైన్యము నొందగ జేసిపోయెగా!
నా పరమేశుడే గతియ! యాభరణమ్ముల పారవైచి, తా
నా విరహంబుతో కుమిలె, నౌర యిలన్ మగజాతి బుద్ధికిన్!

**5. ఖండిత**

ఉ. మెలగితి నొక్క ప్రాణముగ మీ కనుసన్నలలోన నెప్పుడున్!
అలుక వహించి నీవు నను నవ్వులపాలొనరించి యిట్టులే
నెలతను పొందబోయితివా? యీ నడిరేయిటు వచ్చితీవు! నీ
పలుకులు చాలు చాలికను వచ్చిన దారినె పొమ్ము పొమ్మికన్!

**6. కలహాంతరిత**

ఉ. మాట సమస్త సౌఖ్యముల మార్గమటంచును గానలేక, నే
సూటిగ మాటలాడి కడుశోకము నొందగ జేసినాను! నె
చ్చోటికి బోయెనో విభుడు? చూచియు చెప్పరె యమ్మలార! యీ
నాటికి బుద్ధి వచ్చె! నిక నమ్మరె? నేరము జేయ నెన్నడున్!

**7. ప్రోషితభర్తృక**

ఉ. కలత వహించకమ్మ! కలకాలము కష్టము లుండబోవుగా!
వలచిన నిత్యమౌ సుఖపు వారిధి గోరన ధర్మబద్ధమౌ
కలయను జీవితమ్ము నిది గాంచిన నిత్యసుఖాబ్ధి నీదెయై
యలరును దివ్యరూపముగ, నాకసము న్నెలవంక రీతిగన్!

**8. అభిసారిక**

ఉ. పారెడు నేరు దాటితిని! పాముల తేళ్ళ నధఃకరించి, శృం
గారపు కేళికై తనువు కామముతోడ దహించుచుండ, వే
సారితి! వేగరమ్మ! యభిసారిక నీవిక నేలుకొమ్ము! శ్రీ
కార మనోహరాకృత సతి కామము దీర్చి, తరింపజేయుమా!

**(మొబైల్: 7981497017)**





# వి.వి.యన్. వరలక్ష్మి

**1. స్వాధీనపతిక**

ఉ. మాపటివేళ నా సుదతి మాధవుఁ దల్చుచు సెజ్జఁజేర, దా
నోప; డెడమ్ముఁ జేర జను; నొప్పుగ గంధమలందుఁ; బూవులన్
మైపయిఁ బోయు; మెచ్చునికమవ్వము; భూషలఁ జక్కచేయు; నా
పైపెన వేయు; నింక నెడబాటును దీర్చు మనోహరుండునై!

**2. వాసకసజ్జిక**

ఉ. మెత్తని చీరఁ గట్టి, సుతిమెత్తగ నత్తరు మెత్తె నొత్తుగన్;
గుత్తపు పూలచెండులను గొప్పున బెట్టి, విడెమ్ముఁ జుట్టెఁ దాన్;
గుత్తుకఁ జేర్చెఁ బేరులను; గూర్చె లతాంతపు శయ్య నత్తరిన్;
చిత్తముఁనందుఁ దోచె పతి చేటములంత వధూటి సిగ్గిలెన్!

**3. విరహోత్కంఠిత**

ఉ. తాళ నశక్యమై మదన తాపము వేల్చుచునుండె! నీ
వేళను దేనెసోనలనిపించు వచస్సులు! మొల్కనవ్వు లే
పాళములేకరేచు! వలవంతము నాథుడు నేగె దవుఁ! దా
రాళి యెఱుంగు నా ప్రియుని రాకడ గుట్టుగఁ దెల్పి తేర్చరే!

**4. విప్రలబ్ధ**

ఉ. చిక్కనిజీకటుల్ నడుమఁ జిన్నది యొంటిగ వేచి వేచి, నేఁ
జిక్కితి మోహజాలమున జీరి వనాంతర కేళికై, తనే
ప్రక్కకుఁ బోయెనో, యిది పరాభవమే కపటమ్మటంచుఁ దాఁ
జెక్కిటఁ జేయినాన్చి కడుచింతిలె నంగన విప్రలబ్ధయై!

**5. ఖండిత**

ఉ. కంటిని బూలరేకులను కందువపైఁ బొలపమ్ము గుప్పనెన్
గంటి విడెంపు చారికలు గంధపు చూర్ణముఁ గుంకుమంబయో
యొంటిగనుంటి నేనిచట నుల్లసనమ్ముగ పొందుఁగూడి వా
ల్గంటి సమాగమమ్మిడు తలంపులఁ దేలుచు వచ్చె నాథుడున్!

**6. కలహాంతరిత**

ఉ. కద్దు కదా ప్రలాపము నకారణమల్కయు జంట మధ్య నీ
ప్రొద్దు వియోగమాయె సరిపుచ్చగ నాథుడు నేగెఁ గోపియై
వద్దన జాలనైతి నెడబాటు భరించుట శాపమాయెనే
హద్దులెఱుంగ నాలుమగ లాదరమిట్లు యభాసుపాలయెన్!

**7. ప్రోషితభర్తృక**

ఉ. ఏల ముగించి రాడె మగడింకను జూడక యెట్టులుందు నీ
జాలము నోపఁజాలనయ చక్కని భూషలు బొట్టు వేణిఁ బూ
మాలలఁ బూన్చి నాథ ముదమారఁగ ముంగిటనుంటి వేగరా
నాలము సేయనేల నిక నంగజు తూపులు నొవ్వజేయునన్!

**8. అభిసారిక**

ఉ. పొత్తును గోరి రమ్మనుచు ముద్దియ సాగెన దమ్ము వంకనే
తత్తరపాటు లేక నొక తైరవభూషలుఁ దళ్కు లీనగా
నత్తఱి నామె యున్కి విరులందెలుఁ జెప్పగ వేగిరమ్ము గా
నత్తఱిఁ జేరఁ జాలువరుఁ జేరుదునంచు తలంచె నామెయున్!

**(మొబైల్: 93814 15881)**





# యెలిశెట్టి చంద్రశేఖర్

**1. స్వాధీనపతిక**

ఆ.వె. తాను కోరినట్లు తారాడు రమణుని
పొందు గూర్చి వలపు విందుజేయు
స్వంతమొంద విభుని స్వాధీనభర్తృక
పదకటింట జేయు పాదసేవ!

**2. వాసకసజ్జిక**

ఆ.వె. ఎదురుచూచుచుండు నెదురేగి ముద్దాడ
సర్వసుందరముగ సంగమంద
వలపునందు విఱియు వాసకసజ్జిక
లచ్చి కోడలట్లు రెచ్చిపోవు!

**3. విరహోత్కంఠిత**

ఆ.వె. విరహమతిశయిల్లువిభునిరాకనుగూర్చి
తపననోపలేకతల్లడిల్లుజి
పాన్పునెక్కిదిగుచుపొరాడునుత్కంఠ
పొందుపొందనెపుడుతొందరేగు!

**4. విప్రలబ్ధ**

ఆ. వె. ప్రియుని వాటమంద వేచియు మరుగున
రేయియంత వలపు రేగ దిగులు
కల్ల సేయ గాంచి కసరుచు నగలన్ని
విసరు నెల్లప్రక్క విప్రలబ్ధ!



ప్రియుడు నిర్దేశించిన సంకేత స్థలమునకు రహస్యముగ ఆటంకముల లెక్కింపక ఒంటరియై వేగముగ జను అంబురుహాక్షి - అభిసారిక





**5. ఖండిత**

ఆ.వె. కినుకబూని మసలు గిట్టని వలపున
నెఱుఁగ ప్రియుని ప్రీతినెరవు వనిత
యెగసిపాటు కసిని యెరిగించు ఖండిత
క్రుంగిపోవు మదిని బుంగమూతి!

**6. కలహాంతరిత**

ఆ.వె. చపలమంద ప్రియుని శాసించు కలహాన
మోపు నింద మెండు మొత్తులాడు
కల్లు ద్రావవేడు కలహాంతరిత గాన
తనను గాక వేరు తావుబోక!

**7. ప్రోషితభర్తృక**

ఆ.వె. విత్తమార్జనమున వేరు దేశమునేగ
వెతల నెఱుకపరచు ప్రియుని కొరకు
నూరడించనెంత నువ్వెత్తు దుఃఖించు
పోషణార్థమనగ బుజ్జగింపు!

**8. అభిసారిక**

ఆ.వె. ఒగ్గు ప్రియుని జేర తగ్గకనెటులైన
గుట్టుమట్టు నడత గొప్ప నేర్పు
రతిని బొంద నరుగు రట్టడి లేకుండ
నభిచరించు సారిక యభిమతిని!

**(మొబైల్: 95383 68333)**

# అన్నమయ్య అష్టవిధనాయికా శృంగార నీరాజనం

**అ**న్నమయ్య సంకీర్తనలు 16వ శతాబ్ది నుంచే ప్రజల నాలుకలపై ప్రచారంలో ఉన్నా సరయిన గుర్తింపు, ప్రాచుర్యం ఇరవయ్యోవ శతాబ్దిలోనే వచ్చింది. అన్నమయ్య రచించిన ముప్పది రెండువేల కీర్తనలకు గాను ప్రస్తుతం కేవలం పన్నెండువేలు మాత్రమే లభిస్తున్నవి. ఈ కీర్తనలలో ఎక్కువభాగం శృంగార కీర్తనలే! ఆ కీర్తనల్లో దేవదేవుని శృంగారకలాపాల వర్ణన, అలిమేలుమంగ నాయికగా, శ్రీ వేంకటేశ్వరుడు నాయకునిగా సాగుతుంది. శృంగారకీర్తనలు అనగానే జనసామాన్యంలో ఆ కీర్తనలు ఏవో అశ్లీలబద్ధం అనే అపోహ ఉంది. అసలు విషయం ఏమిటంటే... కామం వేరు, శృంగారం వేరు. కలుషమైన తుచ్ఛకోరికతో కూడినది కామం అయితే.. చతుర్విధ పురుషార్థ సాధనకై ధార్మిక చింతనతో నడిచేది శృంగారం.

పదకవితా పితామహుడైన అన్నమయ్య తానే అలమేలుమంగగా, వేంకటేశ్వరునిలా, చెలికత్తెలుగా, తోడి సతి (సవతి)గా, శృంగారదూతికగా.. బహువిధమైన రూపాలతో, నాయిక రూపాలను వేలాదిగా విస్తృతపరచి నాయికా వైవిధ్యాన్ని తన కీర్తనల ద్వారా మనకు ప్రసాదించి మనలను అలరిస్తాడు. తద్వారా ఒక నూతన అలంకార శాస్త్రానికి ఒరవడి పెట్టాడు అంటే అతిశయోక్తి కాదు. నవరసాలలో 'శృంగార' రసానిదే అగ్రస్థానం. శృంగారం లేనిదే సృష్టే లేదు. అందువలన ఏ భాషలోనైనా శృంగారానికే ప్రాధాన్యతనిచ్చారు.

అయితే... భగవత్పరమైన శృంగార సంకీర్తనా రచన ఎంతో కష్టమైన ప్రక్రియ. అన్నమయ్య ఔచిత్యాన్ని గ్రహించి, అనౌచిత్యాన్ని పరిహరించి, మనోరథసిద్ధినీ, భగవత్సాక్షాత్కారాన్నీ పొందిన మహనీయుడు. అన్నముని శృంగార కీర్తనలలో బాహ్యరతి వర్ణనమే తప్ప అభ్యంతర వర్ణనము కనపడదు. 'ఏలితివి', 'కూడితివి' వంటి సూచక శబ్దాలతోనే పరమార్థాన్ని చూపించాడు. భక్తికీ,





శృంగారానికీ అభేద ప్రతిపత్తిగా నిరూపణ గావించిన అన్నమయ్య తన సంకీర్తనలలో.. అభిలాష, ఈర్ష్య, విరహము, ప్రవాసాలతో గూడిన విప్రలబ్ధ శృంగారానికే ఆధిక్యత నిచ్చాడు.

అన్నమయ్య శృంగార సంకీర్తనలన్నిటిలోనూ శ్రీవేంకటేశ్వరుడే నాయకుడు, అలిమేలు మంగమ్మే నాయిక. ఆయన తన భక్తితత్వాన్ని అమ్మను-వేంకటపతినీ శృంగార నాయిక-నాయకులుగా జేసి సర్వజనామోదమైన రీతిలో బహుముఖంగా వర్ణించి తన్మయత్వం పొందిన మహాభక్తుడు. అన్నముని శృంగార కీర్తనలన్నీ.. శ్రీవేంకటేశ్వరునికీ, అలమేలుమంగకూ ఇచ్చిన శృంగార నీరాజనాలుగా ప్రఖ్యాతి పొందాయి. ఈ సంకీర్తనలన్నీ వైష్ణవ మధురభక్తి సాంప్రదాయ వృక్షం కొమ్మలే! నాయికా నాయకుల అష్టవిధనాయికల శృంగారకీర్తనా నైవేద్యం ఆరగించే ముందు అన్నమయ్య శృంగార కీర్తనలకు 'తెరతీసే కీర్తన' (కర్టన్ రయిజర్) లాంటి అద్భుతమైన కీర్తన ఒకటి అస్వాదిద్దాం. "ఇది అన్నమయ్య రసికులకిచ్చిన సందేశం! రసిక జీవన నాట్యశిల్పానికి మూలసూత్రం, శృంగార సంకీర్తనలకు మహాద్వారం" అంటారు.

పల్లవి: విరహము వలవదు రసికులు వినరో చాటుచుఁ జెప్పెద
తరితీపను చెఱకున నిత్తఱిఁ బండు వండె నిదివో ॥ విరహము॥

చరణం 1: బగివాయఁగ రాదిక దంపతులకు నెక్కడ చూచిన
చిగురుకుఁ జేఁగలు వచ్చెను చిత్తజు రాజ్యమున
తగిలి తగిలి కోవిల కూతలు మొగసాలల కెక్కెను
జగమున విరసపుఁ బవనుఁడు చల్లని వాఁడాయ ॥ విరహము॥

చరణం 2: పొసఁగంగ నెవ్వరికైనను పొందులె జరపఁగ వలసెను
పసిమొగ్గలు వాడెక్కెను వసంతకాలమున
ముసగస లాడెడు తుమ్మిదల మోతల చలములు చెల్లెను
సుసరము నసె పగరాజును చుట్టము వాఁడాయ ॥ విరహము॥

చరణం 3: కలయికలే కలకాలము కాణాచులుగాఁ బరగెను
ఇలలో శ్రీ వేంకటపతి యిచ్చిన సంపదను
యెలమిని పదారువేలకు ఇతఁడే మగడై నిలిచెను
కలగొని మనసనియెడి చెలికాడును దోడాయ. ॥ విరహము॥

(తాళ్ళపాక పదసాహిత్యము శృంగార సంకీర్తనలు - 28 సంపుటం, రేకు 1805 - వ.సం.27)

**విశ్లేషణ**

"అయ్యలారా రండు! మీకు విరహం ఏ మాత్రం వద్దు. చెఱకు విలుకాని (మన్మథుని) పంట అద్భుతంగా పండింది. ఇక్కడ వినండి నా మాట." ఇక దంపతులకు ఎడబాటు అనేదే ఉండదు, ఒకరికొకరు హత్తుకొని తిరగడమే. ఈ చిత్తజు (మన్మథ) సామ్రాజ్యంలో చిగురుకు సైతం మంచి బలం వచ్చింది. అప్పటి వరకూ వేడిగాలులు వీచిన వాయుదేవుడు మనసు మార్చుకుని చల్లగాలులతో శృంగారవిహారులకు అనుకూల పవనుడయ్యాడు. ఇక ఇప్పుడు ప్రేయసీ ప్రియులకు సమాగమం, సంగమం తప్పదు. క్రిక్కిరిసిన తుమ్మెదల గుంపుల మాత్సర్యాలకు కాలం చెల్లింది ఇక. ప్రేయసీ ప్రియులపై పగబూని విరహతాపాలకు గురిచేసిన చంద్రుడు ఇక ఇప్పుడు మీకు దగ్గరి చుట్టమయ్యాడు. రండు రండు ఆలస్యం వలదు. ప్రేయసీ ప్రియులకు కలయికయే కాణాచిగా ఉండడం గురించి చమత్కరిస్తున్నాడు. మనస్సనే చెలికాడు తోడయ్యాడు. ఇక రసికులకు విరహబాధ ఉండనే ఉండదని ఉద్ఘాటిస్తూ అన్నమయ్య శృంగారసామ్రాజ్యానికి తెరతీసి పిలుస్తున్నాడు.

ఇక అన్నమయ్య దర్శించిన అష్టవిధనాయికల తీరుతెన్నులు చూద్దాం.

**స్వాధీనపతిక**

పల్లవి: చక్కని గుణవంతుడు సరి నీకు మగడాయ
యెక్కువైన నీ భాగ్యమేమని చెప్పుదమే

చ.1. నెలత నీ నోములు నేడే ఫలియించె గదే
కలలు నీకిపుడె నిక్కలలాయెనే
పలికిన సగినాలు పతి వచ్చె గదవే
తలచగానే విభుడు తానే ఇందు వచ్చెను ॥చక్కని॥

చ.2. తొల్లిటి మీ పూజలు తుదకెక్కె గదవే
యెల్లగా నీ కోరికలు యీడేరెనే
చెల్లుబడి నీ పంతము చేకూరె గదవే
యిల్లిదివో నీ రమణు డెదుటనున్నాడు ॥చక్కని॥





చ.3. నీ వెంచిన యెన్నికలు నెరవేరె గదవే
కావలసినవి తారుకాణలాయెనే
దేవులవయితివి వావి దిష్టములాయ గదవే
శ్రీవేంకటేశుడు నిన్ను జేకూరినాడు ॥చక్కని॥

(రాగం: రామక్రియ; శృం.సం.సం 28; రాగిరేకు 1862; కీ.సం.361)

**విశ్లేషణ**

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక స్వాధీనపతికయైన పద్మావతీదేవి, నాయికతో తోడిసతులు పలికే పలుకులు ఇవి. పద్మావతీ! సుందరాంగుడైన శ్రీనివాసుడు నీకు భర్తగా లభించాడు. ఇంత సౌభాగ్యవతివైన నిన్ను నీ అదృష్టాన్ని ఏమని చెప్పగలం, పొగడగలం. అనగా నీకు అనుకూలుడైన భర్త లభించాడు. నీవు స్వాధీనపతికవే అని చెప్పడం.

**వాసకసజ్జిక**

పల్లవి: చూడరమ్మ ఇంతులాల సుదతి చందము నేఁడు
వేడుక సింగారాలు వింత వింతలాయను

చ.1. జక్కవ గుబ్బల మీఁది సరులు
వెక్కసపుఁ గొప్పులోని విరులు
చెక్కుటద్దపుఁ గాంతుల సిరులు
చక్కని యీకెకు నెన్ని సమకూడె గురులు ॥చూడు॥

చ. 2. నిలువున నొయ్యారపు నీట్లు
వలపె పయ్యెద వల్లెవాట్లు
మలయు మోము సురటిమాట్లు
కుటుకు నవ్వు లీకెకుఁ గొండలుఁ గోట్లు ॥చూడు॥

చ. 3. కావరపుఁ బిఱుఁదుల కలిమీ
భావములో వలపుల బలిమీ
శ్రీ వేంకటేశుఁడు గూడెఁ జెలియలమేల్మంగను
చేవదేరె నీకెకు చెప్పరాని చెలిమీ ॥చూడు॥

(రాగం: సామంతం; శృం.సం.సం 28; రాగిరేకు 1849; కీ.సం.285)

**విశ్లేషణ**

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుదు నాయకుడు, నాయిక వాసకసజ్జికయైన పద్మావతీదేవి. అమ్మలాలా! కొమ్మలాలా! చూశారా! ఈ దేవేరి ముఖకాంతులు... ఆ పద్ధతీను. అమ్మ బలీయమైన కోరికతో సింగారించుకొని ఎంత విలాసవంతంగా, కొత్త కొత్తగా ఉన్నదో! చూడండి. వాసకసజ్జికలా అని చెలికత్తెలు మాట్లాడడంలో ఔచిత్యం ఉంది. ఆనందం ఉంది. అర్థం ఉంది. పరమార్థం ఉంది.

**విప్రలబ్ధ**

పల్లవి: తానెంత మన్నించినాను తన చిత్తమింతే కాక
నేనే నా యంత వలపు నెరపఁగవచ్చునా ॥ పల్లవి ॥

చ.1. తలఁపు గలిగితేను తానే వచ్చీఁగాక
బలిమిఁ దన్నుఁ బిలిచేపాటి దాననా
అలరి దయవుట్టితే నాదరించీఁగాక నన్ను
కలికితనాల దన్ను గరఁగించ నేర్తునా ॥ తానెంత ॥

చ.2. చుట్టరిక మెంచి నన్ను సొరిది నేలీఁగాక
వట్టి వినయాలఁ దన్ను వంచఁగలనా
అట్టె తన వేడుకకు నంటిపెనఁగీఁగాక
గుట్టుతోడ మెప్పించి కొసర నావసమా ॥ తానెంత ॥

చ.3. మొగమోటమునఁ దానే ముంచి కాఁగిలించీఁగాక
నగుతాఁ గొనగోరఁ జెనకవచ్చునా
తగ శ్రీవేంకటేశుఁడు తానే నన్ను నేలెఁగాక
జిగిమించి తన్ను రట్టు సేయఁగ సంగతా ॥ తానెంత ॥

(రాగము: పాడి, 28–534, రాగిరేకు 1891)

**విశ్లేషణ**

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుదు నాయకుడు, నాయిక విప్రలబ్ధయైన పద్మావతీదేవి. చెలులారా! చూశారా! తనను నేను ఎంత గౌరవిస్తున్నానో మీకు తెలియనిది కాదు కదా! శ్రీవారి చిత్తము నెరుగక నేను వలపు సందేశాలు పంపించ వచ్చునా! అని అమ్మవారు పద్మావతీదేవి చెలికత్తెలతో తనంత తాను వచ్చి నన్ను చేపట్టడం లేదని వాపోతున్నది. శ్రీవేంకటేశ్వరుదు తానే వచ్చి నన్ను ఏలిన ఎంత





బావుంటుంది. కాంతులీనే నా స్వామిని మోహంతో నేను రచ్చకీడ్చడం ఎంతవరకూ సరయిన విషయమో చెప్పండి అని చెలికత్తెలను అడుగుతోంది అమ్మ పద్మావతి.

**విరహోత్కంఠిత**

పల్లవి: ఏమని విన్నవించేము ఇంతి చందములు నీకు
ఆముకొన్న కరుణతో నాదరింతు గాక ॥ పల్లవి ॥

చ.1. వొప్పుగు నిన్నుఁ దలఁచి వువిద పాన్పు మీద
నుప్పతిల్లుఁ జెమటల నోలలాడీని
ముప్పిరిగొన్న వయసు ముంచి యాసలు రేఁచఁగా
చెప్పరాని వలపుల జిమ్మిరేఁగీని ॥ ఏమ ॥

చ.2. వొట్టిన నీ గుణములు వొకటొకటే యెంచుక
అట్టె నిట్టూరుపుల నుయ్యాల లూఁగీని
గట్టిగా నీవిచ్చిన వుంగరము చూచి చూచి
గుట్టుతో దమకముల గుబ్బతిలీని ॥ ఏమ ॥

చ.3. గక్కనఁ జెలులు నీ కతలు చెప్పఁగా విని
వెక్కసపుఁ బులకల విఱ్ఱవీఁగీని
యిక్కడ వచ్చి శ్రీవేంకటేశ యింతిఁ గూడితివి
పిక్కటిల్లు సంతోసాలఁ బెనగొనీని ॥ ఏమ ॥

(రాగము: ఆహిరి, 28–197; రాగిరేకు 1834)

**విశ్లేషణ**

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుదు నాయకుడు, నాయిక విరహోత్కంఠితయైన పద్మావతీదేవి, చెలికత్తెలు నాయికను గురించి నాయకునికి విన్నవించే సన్నివేశం. శ్రీనివాసా! ఏమని విన్నవించుకోగలము! ఆ అమ్మ నిన్ను పదే పదే తలుచుకుంటూ తాళలేని వేడికి చెమటలతో పానుపుమీద స్నానం చేసినదా అన్నట్టు ఉన్నది. ఇక్కడ అన్నమయ్య ఉద్దేశ్యం చెలికత్తెల ముఖ్యోద్దేశం ఆ పద్మావతీదేవి తమకంతో మోహంతో ఎదురుచూస్తోంది వచ్చి చేరండి అని రాయబారం నెరపడమే!

**ఖండిత**

పల్లవి: అనుమానించగనేలా అవిగో నీ చేతలు
దినదిన కొత్తలెల్లా దిష్టమాయ మాకు.

చ.1. కొసరి యెవ్వతె నీతో కొంగువట్టి పెనగెనో
పసపల్లా నంటె నదె పచ్చడానను
యెసగి చెక్కులువట్టి యెంత వేడుకొనెనో
సుసరాన గోరికొన సోకులు చూపట్టెను ॥ అనుమా ॥

చ.2. కమ్మటి నాపె యే రీతి కాగిట బిగించెనో
కుమ్మెలువోయి గుబ్బలగురు లున్నవి
యిమ్మల నీవొడివట్టి ఎంత వొడబరచెనో
నెమ్మది గానుకిచ్చిన నిమ్మపండ్లు గంటిని ॥ అనుమా ॥

చ.3. పదాలకు మొక్కి యెట్టు పానుపుపై గూడెనో
పోదితో మైతావి నీపై బొలుపొందెను
పాదుగ నలమేల్మంగ పతివి శ్రీవేంకటేశ
యీదెశ నన్నేలితివి ఈకె నీకు జట్టము ॥ అనుమా ॥

(రాగము: శంకరాభరణం, 28-286 రాగిరేకు 1849)

**విశ్లేషణ**

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక ఖండితయైన పద్మావతీ దేవి, నాయిక నాయకుని పరకాంతతో గడిపి వచ్చాడని కోపంతో మాట్లాడే సన్నివేశం. స్వామీ! ఏ కాంత నీ కొంగు పట్టుకుని చుట్టుకుని నీతో తిరిగినదో! ఎట్టిటి వర్ణం నీ వస్త్రాలకు అంటుకున్నదో చూశారా! అందమైన ఆమె నిన్ను ఎంత గట్టిగా కౌగిలిలో బంధించిందో మరి! ఆమె ద్వారా వచ్చిన గంధము, కర్పూరము మొదలైన పూతలు నీ శరీరంపై అందంగా శోభిస్తున్నాయి అని అమ్మవారు అంటున్నారు. అమ్మ పద్మావతీదేవియే నీకు అందమైన జత సుమా! అని అన్నమయ్య స్వామికి నివేదిస్తున్నాడు.

**కలహాంతరిత**

పల్లవి: గుట్టుతోడిదాన నన్ను గొరబెల సేసేవోయి
గట్టిగా సేసవెట్టితేఁ గాదంటినా నిన్ను

చ.1. చన్నులంట వచ్చేవు జాణతనా లాడేవు
ఇన్నేసి చేఁతలకు నీకేమౌదునోయి





సన్న లూరకె సేసేవు సందులకు లాచేవు
కన్నవారెల్లా నిన్ను గామిడివాఁడనరా ॥ గుట్టుతోడి ॥

చ. 2. కప్పురము చల్లేవు కతలెల్లాఁ జెప్పేవు
అప్పడే నీకుఁ జుట్టమనైతినావోయి
కొప్పు జారఁదీసేవు కొనగోరఁ జెనకేవు
వుప్పతించేవారు నిన్ను నుద్దండీఁడవనరా ॥ గుట్టుతోడి ॥

చ.3. మోవితేనె లడియేవు మోము దప్పక చూచేవు
వావు లింత గలపఁగవలెనా వొయి
శ్రీవేంకటేశ నన్నుఁ జెలరేఁగి కూడితివి
యీవలావలివారు యిచ్చకుఁడ వనరా ॥ గుట్టుతోడి ॥

(రాగము: రీతిగౌళ, 28-297 రాగిరేకు 1851)

**విశ్లేషణ**

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక కలహాంతరితయైన అలమేలుమంగమ్మ, నాయిక నాయకునితో వ్యంగ్యముగా మాట్లాడే సన్నివేశం. శ్రీనివాసా! నాథా! గుట్టుగా కాపురం వెళ్ళదీస్తున్న నాతో వెర్రిమొర్రి వేషాలు వేయడం ఎందుకు? స్వామీ! ఇవన్నీ మానుకోండి. అని వ్యంగ్యంగా చెప్తోంది అమ్మ నాయకునికి.

**ప్రోషితభర్తృక**

పల్లవి: ఎట్టి నోము నోచితివో ఇదివో నీ భాగ్యము
చుట్టరికములెల్లాను చూపవమ్మా

చ.1. యెంత బత్తో నీమీద నింటికి వచ్చెనతడు
చెంతనుండి వూడిగాలు సేయవమ్మా
వంతుకు నీమీద నిదె వలపులు చల్లీని
వింతలు సేయక ఇక విడెమియ్యవమ్మా ॥ ఎట్టి నోము ॥

చ. 2. యేమి వేడుకో కానీ యేకతాలు నీతోనాడి
వేమారు సుద్దులడిగీ వినవమ్మా
దోమటి బాదాలు నీ తొడలపై జాచీని
మోము చూచి వేడుకతో మొక్కవమ్మా ॥ ఎట్టి నోము ॥

చ.3. యేరీతి మన్ననో నేడు ఇన్ని చందములనేలె
చేరి ఇచ్చకములెల్లా జేయవమ్మా
గారవించి నిన్ను శ్రీవేంకటేశ్వరుడు గరుణించె
కూరిమి నిటువలెనే గూడి వుండవమ్మా ॥ ఎట్టి నోము ॥

(రాగము: మాళవిగౌళ, 28–81 రాగిరేకు 1815)

**విశ్లేషణ**

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక పోషితభర్తృకయైన అలమేలుమంగమ్మ, నాయికతో చెలికత్తెలు మాట్లాడే సన్నివేశం. అమ్మా! ఎలాంటి నోములు నోచావో, ఏమి వ్రతాలు పట్టావో తెలియదు. ఇదిగో నీ భాగ్యము పండింది నేడు. అమ్మా! ఎటువంటి ప్రేమయో నీమీద ఇన్ని విధాల నిన్ను గౌరవించి ఏలుకుంటున్నాడు. శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కరుణించాడు. మంచి పొందికతో స్వామివారిని కూడి చేరి ఉండమని చెప్తున్నారు చెలికత్తెలు.

**అభిసారిక**

పల్లవి: వాకిట నుండి యెంత వాడికలు సేసేవు
లోకమెల్లా నెరుగును లోనికి రావయ్యా

చ.1. పడతి వినయముల బయలు వందిలి వెట్టె
తడబాటు సిగ్గులను దడిగట్టెను
వుడివోని తమకము నొడినిండా నీకు నించె
యెడమాట లికనేల ఇంటికి రావయ్యా ॥ వాకిట ॥

చ. 2. కలికి కనుచూపుల కానుకలు నీకు నిచ్చె
సులభాన వలపుల సూడిదలంపె
సెలవుల నవ్వులనే చిత్తమెల్లా గరగించె
వెలినుండి జంపులేల విడిదికి రావయ్యా ॥ వాకిట ॥

చ.3. భామ తమ్మిమొగ్గలను పాన్పు నీకు బరచె
వేమరు మోవి తేనెల విందులు వెట్టె
ఆముక శ్రీవేంకటేశ యట్టె యీకె గూడితివి
దామెల సన్నలవేల తావుకు రావయ్యా ॥ వాకిట ॥





(రాగము: లలిత, 28–463 రాగిరేకు 1879)

**విశ్లేషణ**

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక అభిసారికయైన అలమేలుమంగమ్మ, నాయకుని తనవద్దకు రప్పించుకొని మాట్లాడే సన్నివేశం. ఇలా ఎంతసేపు వాకిటిలో నిలబడి రహస్యంగా ఈ కథ నడిపిస్తావు? మనం తొలిసారిగా కలిసినపుడు మాట్లాడుకున్న మాటలు మళ్ళీ మళ్ళీ నెమరు వేసుకోవలసినవి చాలా ఉన్నవి. ఇంకా యెడమాటలు ఎందుకు త్వరగా వచ్చేయండి స్వామీ శ్రీనివాసా! అంటున్నది అమ్మ. నిను వలచిన భామ (అంటే అమ్మ తనగురించి చెప్పుకుంటూ) పద్మాల మొగ్గలతో చేసిన పానుపు నీకు పరచి సిద్ధంగా ఉంచినది. వేయిమార్లు అధరామృతంతో నీకు విందు చేసినది. ఆరంభములోనే అంకురార్పణ తోడుగా నన్ను నీవు కలిసావు గదా! మన మధ్యలో ఈ పైటచాటు మాటలేల దగ్గరకు రావయ్యా శ్రీవేంకటపతీ! అని అమ్మ అర్థిస్తోంది.

# కావ్యాలంకార సంగ్రహము

గత రెండు వేల సంవత్సరాలలో భారతీయ ఆలంకారికులు సాహిత్య శాస్త్రంలో శిఖరాయమానమైన కృషి సల్పి అనేకానేక సిద్ధాంతాలను నెలకొల్పారు. సిద్ధాంత చర్చలకు పోకుండా తాము అంగీకరించిన సిద్ధాంతాలనే గ్రహిస్తూ సమగ్రంగా సాహిత్య లక్షణాన్ని చెప్పే గ్రంథాలు కూడా వచ్చాయి. సంస్కృతంలో 'ప్రతాపరుద్రీయం' లాంటివి ఇటువంటివే. తెలుగులో అటువంటి రచనకు 'కావ్యాలంకార సంగ్రహము' ద్వారా శ్రీకారం చుట్టినవాడు రామరాజభూషణుడు (భట్టుమూర్తి). ఇది 5 ఆశ్వాసాల అలంకారశాస్త్రము. 'నరసభూపాలీయ'మని దీనికి మరో పేరు. ఇది సంస్కృతంలో విద్యానాథుడు రచించిన 'ప్రతాపరుద్ర యశోభూషణము'ను అనుసరించి వ్రాయబడిన గ్రంథము. కావ్య ధ్వని రసాలంకారముల గురించి, నాయికానాయకులను గురించి, గుణదోషముల గురించి ఇందులో వివరించబడింది. గర్భకవిత్వము, బంధకవిత్వము మొదలగునవి కూడా 'నరసభూపాలీయము'లో ప్రదర్శించాడు. అందులో అష్టవిధనాయికల ప్రవృత్తుల గురించి అందరు నాయికలను ఒకే ఒక పద్యంలో వివరించడం జరిగింది. అలాగే విడివిడిగా కూడా నాయికలను వర్ణించాడు.

సీ. వరుడు కైవసమైన వనిత స్వాధీనభ
 ర్తృక; ప్రియాగమ వేళ గృహము దనువు
సవరించు నింతి వాసకసజ్జ; పతి రాక
 తడవుండ నుత్కంఠ దాల్చు నింతి
విరహోత్క; సంకేతమరసి నాథుడు లేమి
 వెస నార్తయౌ కాంత విప్రలబ్ధ;
విభుడన్య సతిబొంది వేకువ రా గుందు
 నబల ఖండిత; యల్క నధిపు దెగడి





గీ. అనుశయము జెందు సతి కలహాంతరిత; ని
జేశుడు విదేశ గతుడైన గృసత దాల్చు
నతివ ప్రోషిత పతిక; కాంతాభిసరణ
శీల యభిసారి కాఖ్యయై చెలువు మెఱయు.

**అష్టవిధనాయికల గురించి పద్యాలు**

**స్వాధీనపతిక:**

ఉ. శ్రీనిధి యోబ భూవరునృసింహుడు కైవసమై చెలంగగా
భూనుత వైభవ స్ఫురణ బొల్చు యశో జలజాక్షి నిత్య స
మ్మానిత శీలయై ధవుని మన్నన నౌదల యెక్కినట్టి వై
మానిక వాహిని న్నగు నమంద నిజాతిశయంబు పేర్మికిన్.

**వాసకసజ్జిక**

చ. యవన చమూ సమూహముల నాజి జయించి, యుదగ్రదిగ్జయో
త్సవవిభవాభిరాముఁడయి సారెకు నోబయ నారసింహభూ
ధవుఁ దరుదెంచు లగ్నమునఁ దత్పురలక్ష్మి విభూషితోల్లస
ద్భవన విశేషయై మృగమదద్రవవాసనఁ దాల్చు నిచ్చలున్.

**విరహోత్కంఠిత**

ఉ. నెచ్చెలులీ నృసింహ ధరణీవరు దెచ్చెదమంచు బోయిరా
రిచ్చట నీ పునుంగరుణ యించుక లే కలరంప గుంపులన్
గ్రుచ్చెదవేల మత్ప్రియుని గూర్పుము మన్మథ నీకు మద్విభుం
దెచ్చుటకై యొసంగెద మదీయ కటాక్షములన్జయాస్త్రముల్.

**విప్రలబ్ధ**

చ. ఎనయగ నీ నివాసమున కే నరుదెంచెద నంచు నాపయిం
గనుగొన నిక్కపుం బ్రియము గల్గినవాడును బోలె బల్కి యీ
మనికిని రాక తక్కినను మానెడు గాక మదీయ దృష్టికిం
బనుపడి మ్రోలనున్న గతి మాయలు సేయగ నేల భర్తకున్.

**ఖండిత**

చ.   నృపులకు నెల్లవారల భరించుట యోగ్యముగాన నేటిరే
యపరిమితోత్సవంబున బ్రియాసదనంబులకేగి యేగి యా
నెపమున మద్గృహంబునకు నీవరుదేర బ్రభాతమయ్యెగా
కిపుడు నృసింహ! నీపయి నొకించుక వంచన లేదెరుగుదున్.

**కలహాంతరిత**

ఉ.   ఆనఁగరాని కోపమున నప్పుడు కాంతుని ధిక్కరించుచో
మానదురాగ్రహగ్రహము మానుపలేకపు డెందుఁ బోయెనో
యా ననవింటిదంట యిపు డేఁపఁదొడంగె; భవిష్యదర్థముల్
గానని నా మనంబునకుఁ గావలె నిట్టి విషాదవేదనల్.

**ప్రోషితభర్తృక**

చ.   చిరయశ! యోబ భూవరు నృసింహ భవద్రిపు భామ కాననాం
తరమున కేగి యందు నిజనాథుని గానక మన్మథార్తయై
వరుని సరోజ పత్రమున వ్రాయునెడంగరముల్సెమర్పగా
నరయ నిజాంగకంబె పగమయ్యెనటందు దలంచు దైవమున్.

**అభిసారిక**

ఉ.   నాతిమదిం బ్రియాభిసరణం బొనరింపదలంచె దీవుఁ చం
ద్రాతపసాంద్రదీధితు లజాండకటాహము నిండ బర్వగా
నీ తలపెట్లు గూడు రమణీ! వలెనో నొక పన్నెగాగ ము
క్తాతతులుం బ్రసూనములు దాల్పు మలందుము గంధసారమున్.





# మహా వాగ్గేయకారుడు క్షేత్రయ్య

మన ఆంధ్రరాష్ట్రంలో ఎందరో వాగ్గేయకారులు, పదకర్తలు వెలసి సామాన్య ప్రజానీకానికి భక్తి, తాత్త్వికత, నీతి, వైరాగ్యాది మార్గాలను చూపి, ప్రజలలో చైతన్యం తీసుకొని రావడానికి ప్రయత్నించారు. అందులో మహావాగ్గేయకారుడు క్షేత్రయ్య కూడా ఒకరు. ఈయన అనేక పుణ్యక్షేత్రాలు, దేవాలయాలను సందర్శిస్తూ ఉండటం చేత ఈయనకు 'క్షేత్రజ్ఞుడు' అనే పేరు వచ్చి, క్రమేణా అది క్షేత్రయ్యగా మారింది. క్షేత్రయ్యగారి జీవితకాలం 1595–1660 మధ్యకాలమని చరిత్రకారుల అభిప్రాయం. ఈయన జన్మస్థలం ప్రస్తుత ఆంధ్రప్రదేశ్‌లోని, కృష్ణాజిల్లాలో 'మొవ్వ' గ్రామం. ఆ ఊరిలో వెలసిన వేణుగోపాలస్వామి ఈయన ఇష్టదైవం. భక్తుడు తనను నాయికగా భావించి భగవంతుని పొందుకోసం చెందే ఆరాటమే మధురభక్తి. ఇలాంటి మధురభక్తి ప్రబలంగా ఉన్న 17వ శతాబ్దంలో క్షేత్రయ్య జీవించారు. పదకవితలకు ఆద్యుడిగా క్షేత్రయ్యను భావిస్తున్నారు. ఆయన 4,500కు పైగా పదాలు రచించారని సాహితీకారుల అభిప్రాయం. ఈనాడు మనకు 330 పదాలు మాత్రమే లభిస్తున్నాయి.

క్షేత్రయ్య పదాలలో లలితమైన తెలుగుతనంతోపాటు, చక్కని అలంకారాలు మరియు జాతీయాలు ఎక్కువగా కనిపిస్తాయి. సంగీతానికి, సాహిత్యానికి సరైన ప్రాధాన్యము ఇచ్చిన పదకర్తగా ఆధునికులు క్షేత్రయ్యను మిక్కిలి ప్రశంసించారు. ఒక్కమాటలో చెప్పాలంటే క్షేత్రయ్య పదం దృశ్య శ్రవణ సమసంబంధి! కళాహృదయ చైతన్యగ్రంధి! సంగీత సాహిత్య అభినయాలకు సముచిత ప్రాధాన్యత ఉన్న పదకవితలను రచించి క్షేత్రయ్య తరువాతివారికెందరికో మార్గదర్శకుడైనారు. క్షేత్రయ్య వట్టి పదకర్తయే కాదు. అలంకారశాస్త్రములో ప్రావీణ్యత సంపాదించి క్రొత్తపుంతలు త్రొక్కినారు. మనమెట్టి నాయికా నాయకుల గురించి తెలుసుకోవాలన్నా గాని క్షేత్రయ్య పదాలలో చక్కని ఉదాహరణం లభిస్తుంది. ముఖ్యంగా అష్టవిధ నాయికలే గాక ఇంకా అనేక నాయికా నాయికలను గూర్చి తన పదాలలో పేర్కొన్నాడు. అభినయానికి అనుగుణమైన పదాలను తెలుగులో

రచించి సంస్కృత పండితులు సైతం ముక్కుమీద వేలేసుకొనేటట్టు చేశారు క్షేత్రయ్య. క్షేత్రయ్య ఎక్కువగా భాషాంగరాగాలనే వాడారని మంచాళ జగన్నాథరావు గారు చెప్పారు. సాంప్రదాయానికి విరుద్ధంగా క్షేత్రయ్య పదాలను పాడేటప్పుడు మొదట అనుపల్లవినీ, తర్వాత పల్లవిని పాడుతారు. క్షేత్రయ్య పదాలను భరతనాట్యం, కూచిపూడి పద్ధతులలో సొగసుగా అభినయించి వెంపటి సత్యం, నటరాజు రామకృష్ణ, కళానిధి నారాయణన్‌గార్లు పేరుప్రఖ్యాతులు సంపాదించారు. ఆయన నాయికల్లోని అష్టవిధనాయికలపై అల్లిన పదాలను చూద్దాం.

**స్వాధీనపతిక**

నాయిక అలుక వహించింది. నాయకుడు విరహంతో వేగిపోయాడు. పడతీ! తప్పు సైరించు అని ప్రాధేయపడ్డాడు. ఇక్కడ ఆమెకు అతను వశవర్తిగా కనుపిస్తాడు. ఆమె స్వాధీనపతిక. అతడు ఆమె అపాంగవశ్యుడు. నాయిక ఈ వృత్తాంతాన్ని చెలితో చెప్పినట్టు సాగుతుంది ఈ క్షేత్రయ్య పదం.

పల్లవి: అనుకూలుడైనట్టి మగవాడు కలిగితే
అంతకన్నను సంభ్రమున్నదా

అనుపల్లవి: వినవమ్మ! అలిగియుండినను కూటమిసేయు

చ. 1. వేడ్కలకు వెలయుచున్నదా ఓ చెలియ!
పడతి నేటికి తప్పుగావుమని నను గదియ
నడుగుకొని కౌగిట జేరుచు పట్టి
తొడలపై చెక్కిలినిడి చెలిమి నులిమి

చ. 2. పెడమరల బొరలించి తనదు వలకేలను
సడలి యున్న ముంగురులు
కడకొత్త నెమ్మోమున – నెడసి పొదలిన వగల
తొడి బటి ఇట్లట్లు సంభ్రమము
తో నను గనక మురియగవచ్చు

**వాసకసజ్జిక**

నాయిక నాయకునికోసం పడకిల్లు శృంగారించింది. అతనికోసం ఎదురు చూసింది. ఎంతకూ అతను రాలేదు. యాతన ఆమె చేతనను నలిపివేయసాగింది.





ఆ నిస్పృహ పద పదంలో పలవరించింది. ఆమె క్షేత్రయ్య పదంలో పల్లవించిన వాసకసజ్జిక. నాయిక తన వృత్తాంతాన్ని చెప్పుకుంటోంది.

పల్లవి: ఇంత ప్రొద్దాయె ఇంక వాడేమి వచ్చేని ॥

అనుపల్లవి: చింతింప పని లేదు చెలియ మువ్వగోపాలు

చ. 1. చేరి నాతో నేస్తము చేసిన పాపమా
కీరవాణి రో ఏల వేగించేవే నీవు
నూరిన గంధ కస్తూరి పారవేసి పవళించు
ఏ రమణి ఇంట నున్నాడో యూరెల్ల మాటు మడగె ॥

చ. 2. భాసురాంగిరో వినవె పక్షులు మొదలుగాను
వసముల చేరి తమ వనితల గూడె
ఆశించిన ఫలించె దరుదు గాదటవే నే
చేసిన పాపము ఎవ్వరు చేసినారే ఓ చెలియ ॥

చ. 3. పమ్మిన వేడుకతోను పడకిల్లు శృంగారించి
ఎమ్మె కాడు వచ్చునని ఎదురుచూచితి
సొమ్ములేలే విరులేలే సొగసెవ్వరు చూచెదరే
కొమ్మ నన్నేలిన మువ్వగోపాలుని నమ్మరాదే ॥

**విప్రలబ్ధ**

చెలికత్తెలు నాయికమీద లేనిపోని చాడీలు చెప్పి దోషాలు ఆరోపించి ఆమెపై విముఖుడయ్యేట్టు చేశారు. విభుడెంతకూ రావడం లేదు. ఆమెకు పంతం అధికమయింది. అతనిపట్ల కోపించి విచారగ్రస్తయైనది. నాయిక విలపించింది. చెలులు అలా చేసినందువల్ల వారినీ దుయ్యబట్టింది. నాయకుని కోసం వేచి వేసారిందా విప్రలబ్ధ.

పల్లవి: ఐరాదె నేస్తమమ్మలార!

అను: సారసాక్షి పోరేది – చాలునమ్మ చెలులతో

చ. 1. నామీద నెనరు కల్గి – నా వారివలెనుండి
ఏమేమో విభునితో – ఎగబోసినారమ్మా!
ఆ మాట నిజము చేసి – అతడిందు రాడాయె!

వామాక్షిరో! మేకవన్నె పులివంటి చెలులే!

ч.2. నుడువ నోరాడదమ్మ! నూగింజయిన నాననియరు
అదలి నేనొకరితో - నాడుకో రాదె!
పదతిరో నా మాటలన్ని - పలికేరే విభునితో
ముదుచక పోయేరు - మునుముచ్చులీ చెలులు

చ.3. పాయక మువ్వగోపాల - భావమైన అఖిలాండ
నాయకుడైన వరదుడు - నన్ను గూడి
గాయక మెరుగదమ్మ - కటకట తెలియదు
కాయజుని తలిరు పదను - కత్తులమ్మ ఈ చెలులు.

**ఖండిత**

నాయకుని మేనిపై పరకాంతా నఖక్షతాలు, దంతక్షతాల వంటి చిహ్నాలను గమనించిన నాయిక కోపించింది. ఆమె మానసంలో అగ్నిగోళాలను సృష్టించాయి. నాయిక ఖండితయై తన సరసకు రావద్దని తిరస్కరించింది. దక్షిణ నాయకుడైన మువ్వగోపాలుడు ఆమెను ఊరించి ఉడికించాడు. ఆ వైనం ఈ క్షేత్రయ్య పదంలో చూద్దాం.

పల్లవి: చాలు! చాలు! ఈ చిన్నెలతో నాదు - సరసకు చేరకుర
చాలు ఈ చిన్నెలు - సాగవు నావద్ద
మువ్వగోపాల - భామ వద్దకే పోర

చ.1. కన్నుల వీడెముతో - కాటుక మోవితో
వెన్నుని కీల్జడ - వేటుతోను
కన్నియ సంపుల - గాజుల నొక్కులతోను
వన్నెకాడ నుదుటను - నున్న లత్తుకతోడను

చ.2 నిద్దుర మబ్బుతోను - నిండు బడలికతోను
ముద్దియ కలసిన - ముదము తోడ
నిద్దంపు చెక్కిళ్ళు - నెలవంకలతోను
వద్దురా పద్దులు - వగకాడ! నాతోను.

చ.3. అలదాని కుచముల - నలదిన జవ్వాజి
కలయుర స్థలమును - గంటి నన్నంటరాకు





బలిమి చేసేదేల - బాల మువ్వగోపాల
అలనాడె గూడిన - చెలిమి పదివేలు

**కలహాంతరిత**

నాయిక కోపంతో నాయకుడిని పట్టించుకోలేదు. తర్వాత తన తప్పిదాన్ని గుర్తించింది. పరోక్షంగా పశ్చాత్తాపాన్ని ప్రకటించింది. తన మనోగతాన్ని నేరుగా నాయకునితో కాక తన చెలికత్తెతో చెబుతోంది. క్షేత్రయ్య కలహాంతరిత ఏమంటున్నదో విందాం.

పల్లవి: వలపేమి గంపగమ్మ వచ్చునా యెందైన
చెలులార మా యిద్దరి చిత్తములే యెరుగు

చ.1. మాలిమియను తన లాలనచే రతి
వేళలో నడచిన వింతలు తలచుక
నాలో నేనే నవ్వుచు నుండగను
వేళ తెలిసి విన్నవించనైతి నకట

చ.2. చెలువున దా నా చనుమొనలంటుచు
గిలిగింతమై పులకించి వగ
దలచుక సిగ్గున తలవంచుక తా
పిలిపించి అడిగితే పలుకనైతినట

చ.3. మనసు కరుగ నా మర్మమ్ము లంటుచు
పెనగొని తమకంబునను
గినిసిన తుపాకుల కృష్ణునితోనే
దనివి తీరలేదని బల్కితినట

**అభిసారిక**

నాయిక నాయకునికై విలపిస్తున్నది. పలు పలు విధాల రోదిస్తున్నది. పగలు రేయీ నీకై పరితపిస్తున్నానంటూ అంటున్నది అభిసారిక. క్షేత్రయ్య అభిసారికకు నాయకుడు కనిపించాడో చూద్దాం.

పల్లవి: ఎన్నిటికని నే మెత్తు? - నెంతని వినుతింతు
అను: కన్నె! నీవు చేయు నుప - కారములు పదివేలు ॥ఎన్ని॥

1. విరహ సాగరములో – దరిదాపు లేనపుడు నీ
యురమను తెప్పపై నుంచి – వెరపు తీర్చినందుకా?
మరుని వాడితూపుల – మనసు వేగునప్పుడు
సరగున వచ్చి మది – చల్లజేసినందుకా? ॥ ఎన్ని ॥

2. మగువ నిన్నెడబాసి – పగలు రేయు జీకాకై
వగల బొరలునప్పుడు నా – దిగులు తీర్చినందుకా?
నెగడు కార్చిచ్చు వంటి వె – న్నెల చేత వేగునప్పుడు
జిగిమోవి పానక మిచ్చి – సేద దీర్చినందుకా? ॥ ఎన్ని ॥

3. మొలక నవ్వు మోముతో – మువ్వగోపాల! రమ్మని
కలసి చెమటలూర – కౌగలించినందుకా?
అలిగి నే నూరకుండిన – యంతలోనె తెలుసుకొని
నలినాక్ష! కోపము వద్దు – నమ్మితి నన్నందుకా? ॥ ఎన్ని ॥

**విరహోత్కంఠిత**

క్షేత్రయ్య నాయిక విరహోత్కంఠిత విరహంతో కాగిపోతున్నది. క్షేత్రయ్య నాయికతో గాక నాయిక చెలికత్తెతో తన వేదనను వినిపిస్తున్నది.

పల్లవి: ఏ తీరున రమణిని గెలిచి నీ – వెట్లు రూపొదువో

అను: చూతము రా రా! మదన నీ – చేతి బలిమి మా చెలియ బలిమి
॥ ఏ తీరు ॥

1. రాతిరనే ఏనుగనెక్కి – రాకాచంద్రుడు గొడుగు గాను
లేత తెమ్మెర మొదలైన బలముల – చేత గెలిచెద నంటివా?
పోతుటేనుగు కుంభములే – పొలతి గుబ్బలు మోము చంద్రుడు
నాతి ప్రాణములె చలువ తెమ్మెర – జాతివారిలో పగలు గలవా
॥ ఏ తీరు ॥

2. జంటవిరి దమ్మియెద – నంట గుమ్మెద నంటివా?
దంటవే చెవికేలు దమ్మి – తమ్మి యొక్కటే సుమ్మీ!
తుంట విల్లొకటి నీది – తునియని విండ్లు చెలి కన్బొమలు
ఇంటగెలిచి రచ్చ గెలవవలెనను – ఎన్నికలేక పూనితివి
॥ ఏ తీరు ॥





3. అంచెలు మా చెలిని జూచి – యడుగుబెట్ట వెంచిచూడ
పంచ వన్నెల చిలుక – పలుకులే చాన పలుకులు
పంచ బాణములు నీదు – పడతి చూపులే తూపులనగ
ఎంచ శక్యము గాదా మీద – నేలుకొన్నాడు మువ్వగోపాలుడు
॥ ఏ తీరు ॥

**ప్రోషితభర్తృక**

క్షేత్రయ్య నాయిక నాయకునికి దూరమయింది. భర్త వేరే దేశానికి తరలి వెళ్ళాడు. నాయకుని కొరకు పరి పరివిధాల పరితపిస్తున్నది. దైవాన్ని స్మరిస్తున్నది. వేవేల ప్రార్థిస్తున్నది.

పల్లవి: ఏమని తెలుపుదు – నేలాగు తాళుదు నేమి చేతునో చెలియా!

అను: భామరో! యూరికి – బయలుదేరెడి వేళ
ప్రేమ మీర నా సామి – పిలిచి చెప్పిన మాట ॥ ఏమని ॥

చ. 1. అన్నమిందక – అతి వెత నొందకు
కన్నీరు నింపకు – కలవరింపకుమని
ఎన్నెన్నో విధముల – హితవులు తెలుపుచు
కన్నీరు నించుచు – కాంతుడు చెప్పిన మాట ॥ ఏమని ॥

చ. 2. నిడివి కన్నుల నీరు – నించుచు తలయూచి
తడలేక వేగ – తానే వచ్చెదనని
అడుగడుగున కుసు – రసు రని మదిలోన
కడు మోహమున ప్రాణే – శుడు పలికిన మాట ॥ ఏమని ॥

చ. 3. ఏ నోము నోచితినో – ఎంతని వేడితినో
తానేమి వ్రాసెనో – తలమీద విధియని
పూనిక తోడ మా – మువ్వగోపాలుడు
సూనశరుని కేళి – సుఖియింతమను మాట ॥ ఏమని ॥

# కందుకూరి రుద్రకవి జనార్దనాష్టకము

**కం**దుకూరి రుద్రకవి (1480–1560) పదహారవ శతాబ్దానికి చెందిన కవి. తెలుగులో లభ్యమౌతున్న మొట్టమొదటి యక్షగానపుకర్తగా ప్రసిద్ధుడు. ఈయన ప్రసిద్ధి పొందిన జనార్దనాష్టకములో 'కందుకూరి జనార్దనా!' అనే మకుటంతో ఉన్న ఎనిమిది పద్యాలు అష్టవిధ నాయికలను వర్ణిస్తాయి. శృంగారాష్టకాలలో రుద్రకవి జనార్దనాష్టకమే ప్రాచీనమైనది. మత్తకోకిల ఛందస్సును మాత్రా ఛందస్సులలోనికి మార్చి రచనను సాగించాడు. ఆదిప్రాసే కాక తొలి మూడు పాదాలకు అంత్యనియమం కూడా ఉంది. 'దనుజమర్దన! కందుకూరి జనార్దనా!' అన్న సంబోధనే మకుటం. ఈ జనార్దనాష్టకంలోని పద్యాలకు రాగం కట్టి పూర్వం దేవదాసీలు నృత్యం చేసేవారట. ఇవి కొన్నాళ్ళ క్రితం అందమైన బాపూ బొమ్మలతో ఒక పత్రికలో ప్రచురింపబడ్డాయి. ఆ తర్వాత పుస్తకంగా కూడా వచ్చాయి.

**1. స్వాధీనపతిక**

సిరులు మించిన పసిడి బంగరు జిలుగు దుప్పటి జారగా
చరణ పద్మము మీద దేహము చంద్రకాంతులు దేరగా
మురువు చూపుచు వచ్చినావో మోహనాకృతి మీరగా
గరుడవాహన! దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

**2. విప్రలబ్ధ**

ఆన పెట్టిన రాకపోతివి ఆయెబో అటు మొన్ననూ
పూని పిలువగా వినకపోతివి పొంచిపోవుచు మొన్ననూ
నేను చూడగ గడచిపోతివి నీటు చేసుకు నిన్ననూ
కానిలేరా! దనుజమర్దన! కందుకూరి జనార్దనా!





**3. విరహోత్కంఠిత**

నిన్న రాతిరి చవిక లోపల నీవు చెలి కూడుంటిరా
ఉన్న మార్గము లన్నియును నే నొకతెచేతను వింటిరా
విన్న మాత్రమూ గాదురా నిను వీధిలో కనుగొంటిరా
కన్నులారా దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

**4. ఖండిత**

బిత్తరంబున మొలక కెంపులు పెదవి నేవ్వతే ఉంచేరా
గుత్తమైన మిటారి గుబ్బలగుమ్మ యెవ్వతె మెచ్చెరా
చిత్తగించక జీరువారను చెక్కి లెవ్వతే నొక్కెరా
కత్తిగోరుల దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

**5. అభిసారిక**

దబ్బులన్నియు తెలుసుకుంటిని తప్పు బాసలు సేయకూ
మబ్బుదేరెడి కన్నుగవతో మాటిమాటికి డాయకూ
ఉబ్బుచెసుక తత్తరంబున నొడలిపై చెయి వేయకూ
గబ్బితనమున దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

**6. కలహాంతరిత**

అండబాయక కూడియుంటివి ఆయె బోయెను నాటికి
ఖండి మండిపడంగ నేటికి కదలు మెప్పటిచోటికి
ఉండరా నీ మాటలకు నేనోర్వజాలను మాటికి
గండిదొంగవు దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

**7. ప్రోషితభర్తృక**

ఆలుకలన్నియు దీర నివు నా అండ కెప్పుడు వస్తివి
పిలిచి నవరత్నాల సొమ్ములు ప్రేమతో నెపుడిస్తివి
వలచి వలపించియును గూరిమి వదల కెప్పుడు మెస్తివి
కలసి వేడుక దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

**8. వాసకసజ్జిక**

కొదవలన్నియు దీర్చుకొంటివి గుణము వేరిగీ శయ్యను
అద నెరిగి నన్నేలితివి విరవాదిపూవుల శయ్యను
మదనకేళికి నీవె జాణవు మారుతాపము మాన్పరా
కదియ రారా దనుజమర్దన! కందుకూరి జనార్దనా!